# దసరా సంచిక

## పిల్లలకు ప్రత్యేకాకర్షణ

## కథలు, గేయాలు, చిత్రాల రచనలో పోటీ

రాబోయే 'విజయదశమి' పండుగకు (1954 అక్టోబరు 6 వ తేదీ) ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. బాల బాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలు, గేయాలు, వ్యాసాలు, బొమ్మలతో పత్రిక ఆకర్షణీయంగా తయారవుతుంది.

బాల బాలికల రచనాశక్తిని, చిత్రలేఖనాశక్తిని ప్రోత్సహించడానికిగాను పోటీ పెడుతున్నాము. ఈ పోటీలో ఒక మంచి కథకు, ఒక మంచి పాటకు, ఒక మంచిబొమ్మకు బహుమతులివ్వబడుతాయి.

ఈ సందర్భంలో రచనలు, చిత్రాలు పంపదలిచేవారు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి.

* పదిహేనేళ్లలోపు బాల బాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనవచ్చును.
* కథలు, గేయాలు, బొమ్మలు, స్వతంత్రమైనవై ఉండాలి.
* కథలు గేయాలు కాగితానికి ఒకేప్రక్క సిరాతో స్పష్టంగా వ్రాయాలి.
* బొమ్మలు రంగులలో కాని, రంగుకాగితం పైన కాని సిరాలతో వ్రాసినవిగాని పనికిరావు. ఇండియన్ ఇంక్‌తోగాని పెన్సిల్‌తోగాని వ్రాసి పంపాలి.
* రచనలు, బొమ్మలు **1954 ఆగస్టు 21 వ తేదీలోగా** మాకు చేరేవిధంగా పంపాలి.
* రచయితలు, చిత్రకారులు తమ పూర్తిపేరు (ఇంటిపేరు కూడా) వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతోపాటు వ్రాసి పంపాలి.
* స్వీకరించబడని రచనల్ని, బొమ్మల్ని తిప్పి పంపాలని కోరేవారు చాలినంత స్టాంపుకూడా చేర్చి పంపాలి.
* కవర్లపైనా లేక రేపర్లపైనా "ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక దసరా పోటీకోసం" అని స్పష్టంగా వ్రాసినవి మాత్రమే పోటీకి స్వీకరించబడతాయి.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : "అగ్నిరాముడు" లో భానుమతి.



లోపలి కవరు చిత్రం :- "చిట్టితల్లి"
ఫొటో: రవీంద్రనాథ్–గుంటూరు.

వెనుకపక్క కవరు చిత్రం :- "మేషద్వయం"
ఫొటో: జి. రామమూర్తి–మద్రాసు.

### పంచతంత్రం - గమనిక

కారణాంతరాలవల్ల పంచతంత్రం-లబ్ధనాశం ప్రస్తుతానికి ప్రచురించలేక పోతున్నందుకు చింతిస్తున్నాం. తిరిగి త్వరలోనే - ప్రచురణ సాగించగలం.

# కాలక్షేపం

"పరుల మనంబులోలి
బహు భంగుల గొల్పి, ప్రసన్నతా గుణ
స్ఫురణ వహింపజేయుటకు
బూనగ నేటికి నీవు చిత్తమా?
స్థిరముగ సుప్రసాదము భజింప
నిలింప మణీగణోదయ
స్ఫురిత గతిన్ మనోరథము
సొంపు వహింపదె నీకు మేలుగన్?"

తా॥ ఓ మనసా! ఇతరుల మనస్సులను అనేక విధములుగా ఒప్పించి మెప్పించి వారికి నీయందు ఆదరణాభిమానములు కలుగునటుగా జేయుటకు పాటుపడెద వెందుకు? స్థిరముగా నీవు నిర్మల నిశ్చల చిత్తమును సాధకము చేసినట్లయితే, చింతామణివలె నీ మనోరథము నీకు శుభప్రదమై వర్ధిల్లదా?

లోకంలో ఉన్నంతకాలం లోకంతో మనకు పనిఉంది. "లోకముతో నాకేటికి?" అని ధిక్కరించడానికి వీలులేదు. నా గ్రంథాన్ని నా కావ్యాన్ని లోకం మెచ్చుకుంటే నాకేమి? మెచ్చుకోనకపోతే నాకేమి? అని ధిక్కరించేటటువంటి నిరంకుశ కవులు ఉన్నారు. వ్యాకరణ శాస్త్రాన్ని అతిక్రమించవచ్చు. యతిగణ ప్రాసలను అతిక్రమించవచ్చు. నిఘంటువులను కూడా నిరాఘాటంగా నిరాకరించవచ్చు. కాని లోకాన్ని ధిక్కరించి కావ్యం వ్రాయడంలో అర్థంలేదు. ప్రయోజనం లేదు. లోకంకోసం కావ్యం వ్రాసినవాడే లోకానికి దాన్ని వెల్లడిస్తాడు. అంతేకాదు లోకంలో తిరిగి లోకానుభవం కొంత కలిగినవాడే అట్టి అనుభవమును పూర్ణంగా జీర్ణం చేసికొని ఏవో కొన్ని వ్రాతలు వ్రాస్తాడు. ఏవో కొన్ని గీతలు గీస్తాడు. ఏవో కొన్ని కూతలు కూస్తాడు. చెట్టుమీద 'కుహూ! కుహూ!' అని కూతకూసే కోయిల ఎవరికోసం కూస్తోంది? తన కూతలను తన ఆలాపనలను లోకం విని ఆనందించి తన ముద్దులొలుకు కంఠస్వరానికి మెచ్చి తనమెడకొక మెడలు తగిలిస్తారనే ఆశతో అది కూయడంలేదు. పికసంబంధమైన స్వరమును పైకస్వరం అంటారు. దానినే, కాకలీ స్వరం అంటారు. అది చాలా ఉచ్చస్థాయిలో ఉంటుంది. కాని పైకస్వరం మనకు మధురంగా ఉన్నప్పటికీ, పైకం కోరి చేసే పాటకచ్చేరి కాదది. వనములో శుకపికశారికలు మధురంగా ప్రకృతిసిద్ధంగా సహజంగా ముద్దులొలుకు ధ్వనులు అనేకం చేయవచ్చు. కాని, ఆ పైక గానమునకు టిక్కెట్లు లేవు. తన గానం లోకం మెచ్చుకుంటున్నదా? లేక, తన గానం లోకుల చెవిలో గుచ్చుకుంటున్నదా? అనే మీమాంసకూడా పికసంతానమునకు లేదు.

మన ప్రాచీన ప్రబంధములలోని ప్రశంసలనుబట్టి చూస్తే విరహతాపం పడుతూ ఉండేటటువంటి రాజకన్యలకు యీ పక్షుల కోలాహలం చాలా అరాజకంగా ఉంటూ ఉండేది. కోయిలకూస్తూఉంటే ఆ విరహతాపావస్థలో ఆ రాజకన్యకు కర్ణకఠోరంగా ఉండేది. ఆ కోకిల తన్ను చూచి వెక్కిరిస్తోంది అని ఆ విరహిణి వికృతార్థం చేసేది. "ఓ గయ్యాళి కోకిలా! ముయ్యి నోరు" అనేది. ఆ విరహిణి యింకా గయ్యాళి అయితే "నీ నోరు పడిపోను! నీ జిహ్వ పడిపోను!" అని తిట్టేది. పట్టమహిషుల గూర్చిన ఈ ఉదంతం అంతా ప్రబంధకవుల శృంగారగ్రంథ భాండాగారంలోని తిలకాష్ఠ మహిషబంధములే గాని, నిజ ప్రేమమహిమ సంబంధ వర్ణనలు కావు. పూర్వకవి కోకిలగోల ఏమైనప్పటికీ, ఒక్కమాట మాత్రము నిజమని మన మనక తప్పదు. ఎంత మంచి శ్రావ్యగాత్ర మాధుర్యమైనప్పటికీ, మన మనస్సు చికాకుగా భీభత్సంగా ఉన్నప్పుడు, ఆగానమాధుర్యం మనం పానం చేయలేము. చక్కని కర్ణాటక సంగీతంకూడా కర్ణకంటకశబ్ద సంభూతంగా ఉంటుంది. బిడ్డకు 104 డిగ్రీల జ్వరం వచ్చి కంగారుపడి కలవరపడుచున్న కన్నతల్లికి ప్రక్కయింటిలోనుంచి వినిపించే రేడియోలో "వస్తావే మా బావ!" అనే పాట వినిపిస్తే ఎక్కడలేని కోపం వస్తుంది. ప్రక్కయింటి అబ్బాయిని పిలిచి "నాయనా! ఆ రేడియో గోల వినలేకుండా ఉన్నాము. ఆ రేడియో మాయిస్తే మీకూ, మీ పెద్దలకూ పదివేల నమస్కారాలు" అని బతిమాలుకుంటుంది. కాబట్టి ఎటువంటి శ్రావ్యమైన మధురస్వరం అయినప్పటికీ, వినేవానిలో ఉన్న హృదయ మాధుర్యాన్ని బట్టి, శ్రుతి కలిసి రక్తికట్టుతుంది. పాట కచ్చేరిలో పాడేవానికి, ఫిడేలు వాయించే వానికి, తంబూరా మీటేవానికీ, శ్రుతి కలిస్తే నే గాని, కచ్చేరి రక్తి కట్టదు. అదే విధంగా పాట వినేవానికీ, పాట పాడే వానికీ మనస్సు ఒక బాటలో ఒక రస స్థాయిలో ఉంటేనే పాట రక్తికట్టుతుంది. ఇది ప్రకృతిసిద్ధమైన రసలక్షణం.

ఇంతకూ, మూలసిద్ధాంతం ఏమిటంటే, చెట్టుమీది కోయిల ఏవిధంగా లోకంతో నిమిత్తం లేకుండా, లోకం అంటే లక్ష్యం లేకుండా, లోకాతీతంగా, యథేచ్ఛగా గొంతెత్తి రాగాలు తీస్తున్నదో, అదే విధంగా కవి కోకిలకూడా తన హృదయంలోని భావాలు ఏవిధంగా పొర్లి ప్రవహిస్తే ఆవిధంగా వాటిని వ్రాసివేస్తానంటాడు. ఫౌంటెన్ పెన్నులోని సిరా ఏవిధంగా ప్రవహిస్తున్నదో తన భావాలుకూడా తనలోనుంచి యథేచ్ఛగా ప్రవహించవలసినదే అంటాడు. నా కవిత్వం చూచి లోకం అహాహా! అంటే ఏం? ఇహిహీ! అంటే ఏం? నే వ్రాసేది నే వ్రాస్తాను. అచ్చు వేయిస్తాను. అమ్మిస్తాను. ఇది నిరంకుశ కవి కోకిలవాదం. కాని లోకంతో నాకేటికి? అని వాదించే కవికోటికి గల యీ మాట ధాటికి అర్థంలేదు మర్మాటికి.

కోయిల అనేది యిలలో వెలసిన కోయిల గాని, ఆకాశంనుంచి ఊడిపడిన పక్షికాదు. ఈ సృష్టిలో దానికొక జాతి ఏర్పడిఉంది. ఆ జాతికొక లక్షణంఉంది—ఆ జాతిపక్షి మామిడిచిగుళ్లు తింటుంది. ఆ చిగుళ్లుతింటే దానికి ఆనందంగా ఉంటుంది. "లలిత రసాల పల్లవ ఖాదియై సొక్కు కోయిల" లక్షణం అది. ఈ లేత చిగుళ్లలోని రసం అది అనుభవిస్తుంది. ఈ జగత్తులోని వస్తు సంపత్తియొక్క రసానుభవజ్ఞానంలో పుట్టి పెరిగి అందులో మగ్నమై లగ్నమైన ప్రాణియొక్క నగ్నసత్యం ఏమిటంటే, దానియొక్క నిజప్రకృతికి భగ్నంగాని విఘ్నంగాని కలుగజాలదు. కలుగుతుందిఅంటే అది అజ్ఞానం. ఒక్క ముక్కలో చెప్పవలెనంటే, ఏవాడ చిలుక ఆవాడ పలుకు. ఈ లోకంలో పుట్టిన చిలుక యీ లోకం పలుకులే పలుకుతుంది. ఇహలోక శ్లోకమ్మే వాల్మీకిమునికోకిలంకూడా వ్రాశాడు,

# ★ కాలక్షేపం ★

లోకానికి అతీతమైన కవిత్వం యీ లోకంలోని కవి ఎవ్వడూ వ్రాయడు. భూమిమీద అవతరించిన కవులందరూ నేలవిడిచి సాము చేయలేరు. లోకంతో మాకేమి పని? అనే కవి కుకవియని ప్రత్యేకంగా విమర్శించడం అనవసరం. "కు" అంటే భూమి అనే అర్థం, ఉంది గనుక "కుకవి" అంటే భూమిమీద ఉండేకవి అని అన్వయించాలి. ఆ లెక్కన చూస్తే కవులందరూ కుకవులే— భావకవులైనా, స్వతంత్ర కవులైనా, నిరంకుశ కవులైనా, లోకాతీత కవులమనెడి లోకతృణీకార కవులైనా, అందరూ కుకవులే. ఈ లోకంలోని గాలి పీలుస్తూ ఈ వాతావరణంలో ఉన్నంతకాలమూ, యీ లోకానికి భావకవి కూడా బద్ధుడే. అతి వాస్తవిక కవి అందరికంటే అతి వాస్తవంగా బద్ధుడు.

ఇంతకూ చెప్పవచ్చిన దేమిటంటే, ప్రకృతికి బద్ధుడైన మానవుడు ప్రకృతికి అతీతుడు కాడు. అందువల్ల లోకానికి బద్ధుడైనవాడు లోకాన్ని ధిక్కరిస్తానంటే, లోకం వెక్కిరిస్తుంది. డాక్టరు జాన్సను అనే ఒక ఆంగ్ల సాహిత్యవేత్త ఇంగ్లండులో బహుకాలం క్రిందట ఉండేవాడు. ఆయన అనేక వంకరటింకర శంకలకు జంకుగొంకు లేకుండా జవాబు చెప్పేవాడు. ఒక పర్యాయము ఆయనవద్ద కొక పెద్దమనిషి వచ్చి, తన ధర్మసందేహం ఆయనకు నివేదించాడు. "పడుచువాడొకడు పడుచుపిల్ల నొకదానిని ప్రేమించాడు. వరించాడు. వాళ్ళ యిద్దరి అన్యోన్య జీవితానికి వివాహం అనే కర్మకాండ ఎందుకు? దాంపత్యం అనేది వాళ్ల యిద్దరికీ మాత్రమే సంబంధించినదై ఉంది. మూడో మనిషికి సంబంధ మేముంది?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు జాన్సను పండితుడు ఒక చక్కని జవాబు చటుక్కున చెప్పివేశాడు. స్త్రీకీ, పురుషునకూ మధ్య లోకం అనేది ఒకటి ఉంది. కాబట్టి "లోకం" అనబడేదానికి కూడా వాళ్ళ దాంపత్యంతో ప్రమేయం ఉంది అన్నాడు. వాళ్లకు లోకంతో ముడి ఉంది అన్నాడు. అందుకని మూడుముళ్లు పడితేనే పెళ్లిళ్లు మన యిళ్ళల్లో అవుతున్న సంగతి మన కళ్ళార చూస్తున్నాము.

అందువల్లనే పెళ్లి శుభలేఖలు సశాస్త్రీయంగా సలక్షణంగా సమర్యాదగా వ్రాసి సన్నిహితులకు స్నేహితులకు పంపిస్తాము. "ఏతచ్ఛుభ ముహూర్తమునకు మీరు కుటుంబ బంధుమిత్ర పరివార సహితముగా విచ్చేసి వధూవరుల నాశీర్వదించి నాచే నొసంగబడు ప్రసక్చందన తాంబూలాది సపర్యల స్వీకరించి నన్నానందింపజేయ గోరుచున్నాను. మంగళం మహత్. శ్రీ శ్రీ శ్రీ. ఇట్లు కన్యాదాత, బుధజనవిధేయ రావు." అని శుభలేఖ ముగించి పసుపు కుంకుమ అత్తరుతో సహా అలంకరించి ఉత్తరాల పెట్టెలో వేసి, అత్తవారింటికి పంపించినట్లుగా ఆయా అడ్రెసులకు పంపిస్తాము. యథాశక్తిగా, యథాసక్తిగా, కన్యాదాత పాట కచ్చేరీ ఏర్పాటుచేస్తాడు. కనీసం పెళ్లికూతురు చెల్లెలిచేత భరతనాట్యం అయినా చేయిస్తాడు. పెళ్లికి వచ్చినవాళ్ళకు గంధం తాంబూలం యిచ్చి తన స్నేహానురాగ బంధం ఎటువంటిదో చూపిస్తాడు. టీపార్టీ గాని, వీలైతే విందు గాని చేసి, అతిథులందరూ ఆనందించి "అన్నదాతా! సుఖీభవ!" అంటే, కన్యాదాత ఉబ్బి తబ్బిబ్బవుతాడు. అంతటితో అతిథులకు మంచి ఖిల్లీ యిచ్చి ఖుషీ చేస్తాడు. వారు వీరిని ఆనందింపజేయడం, వీరిని వారు ఆనందింపజేయడం జరుగుతుంది. ఇదంతా ఏమిటి? ఈవిధంగా మర్యాద యిచ్చి పుచ్చుకోవడం ఎందుకు? ఇవన్నీ వట్టి మెహర్బానీలు. ఇవన్నీ ఫాయిదా లేని రివాజులు. ఊళ్ళో వాళ్ళంతా మనలను భాయి! భాయి! అంటే మనకు వచ్చిన హాయి ఏమిటి? ఈ లోకవాడుకలు శుష్క వేడుకలు. ఈరీతిగా వాదించే నీతికోవిదులు చాలామంది ఉన్నారు. కాని యీ నీతిపాఠం అంతా కల్తీలేని నేతిమిఠాయి కాదు.

ఒక మనిషిని ఇంకొక మనిషి సంతోషపెట్టవలెననే కోరిక తీరికలెత్తకమానవు మానవహృదయంలో - ఎవనికి వాడు ఏకాకిగా ఉండలేడు. తన సంతోషానికి తన ఉల్లాసానికి ఇల్లాలు కావాలి. ఒంటికాయ సొంటికొమ్ములాగున ఉంటే జీవితం కంటకంగా ఉంటుంది. పుంజానికొక పెట్ట కావాలి. ఒక ప్రాణియొక్క జీవిత సౌఖ్యోత్సాహము మరొక ప్రాణియొక్క జీవిత సౌఖ్యోత్సాహంతో పరస్పర అన్యోన్య సాహచర్య ప్రేమానురాగ బంధముగా ప్రకృతిసిద్ధ సూత్రసంబద్ధమై యున్నది. సహధర్మచారిణి అనేది ఏరోజున మనిషికి అనవసరమని వాదిస్తామో, ఆ రోజున సంసారం లేదు. సమష్టి కుటుంబం లేదు. స్వజనం లేదు - స్వసంఘం లేదు - స్వజాతి లేదు. ఆలుబిడ్డలతో ఆరంభమైన ఆత్మజన బృందానుబంధ ప్రేమాంకురము ప్రేమవల్లియై, తామర పాకినట్లుగా తామరతంపరగా విస్తరించి బీరకాయపీచు సంబంధాలు ఎక్కువై, చుట్టాలు పక్కాలు కూడా తన మక్కువ కెక్కయినారు. ఆలి వంకరవారు ఆత్మజనులు అనే మూలసూత్రమే సంఘానికి మంగళసూత్రము. తన బిడ్డలు కూడా ఆలివంకవారే. తన బిడ్డకు బిడ్డనిచ్చి వియ్యముపొందినవారితోడి నెయ్యముకూడా అయ్యను చెయ్యి కడుగనియ్యని కడుపుతీపనెడి కడుతీపి కమ్మని నెయ్యజిడ్డువంటిది.

వారిని ఆనందింపజేస్తే తనకు ఆనందం.

## రైలుబండిలో

టికెట్ కలెక్టరు: "టికెట్ ప్లీజ్"

"టికెట్టు లేదండీ."

టికెట్ కలెక్టరు: టికెట్టు లేకుండా నీవు బండీలో కూర్చోకూడదు.

"కూర్చో లేదు బాబూ నిలబడే ఉన్నాను."

* * *

భార్య (భర్తతో): ఏమండీ మన అమ్మాయి సిరాబుడ్డిలోని సిరా త్రాగేసింది ఏమిటి చేయడం?

భర్త (భార్యతో): చేసేదేముంది! వెంటనే యింత బ్లాటింగ్ పేపరు తినిపించేస్తే పోతుంది.

పి. వి. రాజు, బిలాస్‌పూర్.

తాను తెచ్చిన ఆహారం భాగహారం చేయడమే సంసారం. సమష్టిగా కష్టసుఖాలు అనుభవించడం-సమష్టిగా శక్తికొలది గడించినది సమష్టిగా భుక్తపరచుకొని అనుభవించడం- ఇదే సహజ సమష్టిభోగం - ఇదే సహజ స్వార్థపరార్థసంయోగం. ఈ సమష్టి భోగంలో స్వార్థత్యాగం సహజంగాఉంది. సమష్టి భోగంలోనే త్యాగం అనే యోగం అభ్యాస మవుతూఉంది. భోగం అనే గుహలోంచి త్యాగం అనే కాశీకి మార్గంఉంది.

పరస్పరాశ్రయం లేకుండా ప్రపంచమే లేదని కొంచెం యోచిస్తే చాలు గ్రహించవచ్చు. సూర్యుని చుట్టూ అనేక గ్రహాలు తిరుగుతున్నాయి శూన్యాకాశంలో. కాని అవన్నీ అన్యోన్యాకర్షణ పాశంవల్లనే ఆకాశంలో తిరుగుతున్నాయి. గ్రహాలన్నీ ఒకదాని నింకొకటి ఆకర్షిస్తున్నాయి. అందుకనే యీ గ్రహమండలిని సూర్యకుటుంబం అన్నారు. ఈ జగత్తులో, యీ విశాల విశ్వంలో యిటువంటి సూర్యకుటుంబాలు ఎన్ని ఉన్నాయో! ఇటువంటి సూర్యవంశాలు, చంద్రవంశాలు ఎన్నో ఉన్నాయి. కాని, యీ సూర్య వంశాధిపతులున్నూ చంద్రవంశాధిపతులున్నూ ఒకరిపై ఇంకొకరు కత్తులు నూరుకోవడం లేదు. కదనమునకు కాలుదువ్వుట లేదు. ఒక నీతికీ నియమానికీ జగత్తంతా కట్టుబడి ఉంది. "నియమం బెద్దియు లేక నిల్చునెటులో నిర్భీతిగా లోకముల్ !" అనే విషయం కూలంకషంగా మనం మననంచేస్తే చాలు. జగత్తులోని ప్రతి అణువూ ఇంకొక అణువును ఆకర్షిస్తూనే ఉంది. ఈ పరస్పర ఆకర్షణ లేకపోతే, అణువులన్నీ విడిపోయి పరమాణువులై పోతాయి. అణువు బ్రద్దలైనప్పుడే ఆటంబాంబు ప్రేలుతుంది. ఏరోజున ఆటంబాంబులు ప్రేలుతాయో, అణువులు బ్రద్దలైపోతాయో ఆరోజున జగత్తు విచ్ఛిత్తి అవుతుంది. మానవుడు మన

లేదు - ఆధునిక నవనాగరికతవల్ల సమష్టి కుటుంబ జీవితం నష్టమైపోయింది. భారత దేశంలో కూడా సమష్టి హిందూ కుటుంబములు హారతి కర్పూరంవలె హరించిపోయినాయి. గ్రామజీవితం లక్షులకొలది కక్షల కక్షయపాత్ర అయింది. గ్రామాలలో పొలముగట్ల తగాదాలతో కొమ్ములు తిరిగిన రైతులు కొట్లాడుకొని కోర్టుల కెక్కుతున్నారు. గ్రామసీమలు సంగ్రామసీమలు. సమష్టి కుటుంబ జీవితం, స్వగ్రామ జీవితం స్వాభిమాన శూన్యం అయితే, స్వదేశాభిమాన సూత్రం మాత్రం తెగకుండా మిగులుతుందా? అణువులు విచ్ఛిత్తయ్యేడి కాలంలో అన్యోన్యంగా అణగిమణగి కలిసి మెలసి ఉండేది మానవులా? మానవులు కలహాలు లేకుండా కలసిమెలసి ఉంటే, అణువులు కూడా అభేద్యంగానే ఉంటాయి. అణువుల విచ్ఛిత్తిమూలంగా ప్రేలెడి ఆటంబాంబులు కూడా అనవసరమే.

"ఆటం (*Atom*) బాంబు" అనేది అణుశక్తి గోళమునకు ఇంగ్లీషుపేరు. కాని, "ఆటం" (*Autumn*) అనే శబ్దం ఇంగ్లీషు భాషలోనే ఇంకొకటి ఉంది. దానికి ఆకురాలు కాలం అని అర్థం. "ఆటం" ఋతువు ప్రవేశిస్తే, చెట్ల ఆకులన్నీ రాలిపోయి, బోడి మానులవుతాయి. తిరిగి వసంతం వస్తే అవి చిగిరిస్తాయి. ప్రపంచానికి ప్రశాంతి వసంతం రావాలంటే "ఆటం" యుగం పోవాలి. ప్రజాప్రభుత్వములు క్రొత్త మైత్రి పత్రములు వ్రాసికొని, అంతర్జాతీయాభ్యుదయ ఆశాలతలు చిగిర్చి పుష్పించితేనే గాని జగత్తు కళకళలాడుతూ ఉండదు. విచ్ఛిన్నమైగంపోయి నవ్యయుగం రాదు. లోకానికి ప్రసన్నవదనం ఏర్పడితేనే శాంతి ఆసన్నమవుతుంది.

ఇతర రాజ్యాలన్నీ సుఖంగా ఉండాలని అభిలషించకపోతే ఆత్మానందం కూడా అప్పుడే అంతర్ధానమవుతుంది. పర రాజ్యాలతో మనకేమి పనియని భారతదేశం తటస్థంగా ఉండడం, కపటనాటకంగా ఉంటుంది. అది పురుషలక్షణం కాదు. అది పరుషలక్షణం. కపట తటస్థభావంలో "కచటతప" లనేడి పరుషములు విశేషముగా ఉన్నాయి. అందుకనే పండిత నెహ్రూ కొరియా యుద్ధవ్యవహారంలో జోక్యం కలుగజేసికొన్నాడు. కమ్యూనిస్టు చైనాప్రధానితో చేయి చేయి కలిపి భాయి భాయి అన్నాడు. ఆసియా రాజ్యాలను పరస్పరాశ్రయ రాజ్యాలుగా చేశాడు. ఇండోచైనా యుద్ధవ్యవహారంలో జోక్యం కలుగజేసికొన్నాడు. "ఓం శాంతిః శాంతిః శాంతిః" అనే మంత్రా

## గీతాంజలి

### టాగూర్

(వర్గంతి. — ఆగష్టు 7 వ తేది)

మాటాడకున్న నో
మరి పోనిలే నాథ !
నీమౌన భారమ్ము
నామనసులో దాల్తు.

అచల తారానేత్రి
యా రాత్రివలె నమ్ర
శీర్షనై, అతి సహన
శీలనై వేచెదను.

ఉదయారోచులు తోచి
ఉగ్రతిమిరము తొలగి
ఈమిన్ను జీల్చుకొని
ఎన్నడో నీగాన
హేమకుల్యలు పారు,
నీమాత్ర మెరుగుదును.

నేనెరుంగుదు స్వామి !
నీ భావణములంత
ప్రతికులాయమునుండి
పక్షుల నెగయించు;
ప్రతి వనాంతములోన
ప్రసవజన్మము లెత్తు.

(ఇంగ్లీషుమాతృకకు అనువాదం :
బండూరి రామమోహనరావు.)

హోర ప్రపంచములో. ఇతరుల మనస్సులను అనేక విధములుగా ఒప్పించి మెప్పించి వారికి నీయందు ఆదరణాభిమానములు కలుగునట్లుగా జేయుటకు పాటుపడవెందుకు?

"పరుల మనంబు లోలి
బహుభంగుల గొల్చి ప్రసన్నతాగుణ
స్ఫురణ వహింపజేయుటకు
బూనగ నేటికి నీవు చిత్తమా?"

అనేది పండితవాక్యం కాదన్నాడు పండిత జవహరిలాలు నెహ్రూ. అందుకనే "జవహరిలాలుకూ జై!" అంటోంది గుజర

మనమడు:

ఇది పట్నం ఇది పట్నం
పన్నులనే పాలిచ్చే
పాడియావు
ఈ పట్నం
పాములా ప్రాకుతూ
చెట్టులా ఎదుగుతూ
పావుకోళ్ళ కొంగల్లా
చుట్టూ ఉన్న పల్లెల్ని
అమాయకపు చేపల్ని

చలచల్లగా
మెల మెల్లగా
మింగుతుంది.
ఎదుగుతూన్న
జనాభాతో
ఎదగలేని కొను
ఎదుగుతూన్న
పేదపిల్లతో
ఎదగలేని గూను.

ఇది పాపాల నిల్వకొట్టు
పేదల ప్రాణాలు కొల్లగొట్టు.
పట్నం ఒక తోడేలు
అది అపశ్రుతుల ఫిడేలు
పట్నం నగరానికి అనుకరణ
జీవితాన్ని ప్రతిబింబించని ప్రచురణ.
ఇలాగే ఇలాగే

ఎంతైనా చెప్పొచ్చు
ఇలాగే ఇలాగే
ఎన్నైనా చెప్పొచ్చు

తాత:

బాగుందిరా బాగుంది
పట్నంమీద బలాదూరుగా
తిరుగుతున్నా వనుకున్నాను
తెలివైనవాడివని
తెలుసుకున్నాను.
అయితే అయితే
పదో ఎక్కం
జారుముడి
పదహారో ఎక్కం
పీటముడి
అంతేగా
మనపిల్లల
తలపులింతేగా

మనమడు :

చదువని పిల్లలకంటే తాతా
చదువని మొద్దులకంటే

తాత :

అయితే చదువుల సారం
తెలిసినవాడా
పదవుల బేరం చెయ్యవా
జీతం లాభం తియ్యవా

మనమడు :

అదేమిటి తాతా



ఆగస్టు 1 వ తేదీన ఢిల్లీలో భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన ప్రారంభమైన ఇండో చైనా యుద్ధవిరమణ పర్యవేక్షణసంఘ ప్రాథమిక సమావేశం.

అలా అంటావు
పదవులు
సంత సరుకుల్లే
కొలవిస్తావు
అవి అధికారి దేవుడు
ఇచ్చే వరాలు తాతా
మన తపస్సు ఫలిస్తే నే
అవి వరించు తాతా
అయినా అయినా
ఇప్పుడు నేను
ఈ పదవుల జోలికి
పోనే పోను
చదువుల సంగతి
చూడాల్నేను.

తాత:

చదివిన విద్యలు చాలయ్యా
తండ్రికి సాయం చేయయ్యా
మనలోమాట ఇది వినవయ్యా
చేతికందివచ్చిన కొడుకు
చిక్కులు తెచ్చిపెట్టరా ఎప్పుడు
కష్టాల ఎండలో పడిన తండ్రికి
ఎదిగిన కొడుకు
ఏర్ కండిషన్డ్ రూమే
కావలెను
నీ ధర్మం నెరవేర్చి
ఈ జీవులనో దరిజేర్చి
చదువుకోవయ్యా
నీ ఇష్ట మొచ్చినంత
చదువుకోవయ్యా
పసివుల ప్రమేయమంత.

మనమడు:

అచ్చే అచ్చే అది లాభం లేదు
ఈ బుద్ధి విడచిపెట్టుట మంచిదికాదు
క్లాసొచ్చినవాడికి అన్యాయం జరుగరాదు
పనిలో చ్చేవాణ్ణి అణిచెయ్యడం కోరరాదు
చదువుకోవడం
నా జన్మహక్కు
అదొక్కటే మరి మీరు
తీర్చవలసిన మొక్కు.

తాత:

అంతేనా అంతేనా
అయితే నీ తెలివింతేనా
ఉపన్యాసాలు
దంచడమేనా నీవంతు
జీవితం పీటముడి
కంఠాన బిగిసి
చావడమేనా మావంతు
శ్రద్ధలేని పిల్లవాడా
బాధ్యత తెలియని
పసివాడా
మన జీవితం
పదమూడో ఎక్కం
మన జీవితం



## పండిట్ నెహ్రూ రూపచిత్రం

పై చిత్రాన్ని ప్రసిద్ధ రష్యన్ చిత్రకారుడు అలెగ్జాండర్ గిరాసిమోవ్ లిఖించాడు. ఈయన ఇటీవల ఇండియా వచ్చి 2½ నెలలు గడిపాడు.

పదిహేడో ఎక్కం.

జ్ఞాపకాల గాదెల్లో నిల్వపోసిన జరిగిపోయిన కలగాపులగపు మన సంసారపు సంగతుల మట్టిబెడ్డల ధాన్యాన్ని ఒకసారి విచక్షణజల్లెడతో జల్లించు. ఇప్పుడూహించిన మొక్కుబకుల పాపపు టూహాల దుమ్మును దూగరను సంస్కారపు చేటలతో చెదరగొట్టు. తెలియక చేసిన ఈ తప్పుల చెత్తను పశ్చాత్తాపపు కొండ చీపురతో తుడిచిపెట్టు. నిత్యం సుఖాల పిండివంటలు ఆశించుట విడిచిపెట్టు. అలా కానిపక్షాన బద్ధకంరోగాలప్పుడు మెండై శీఘ్రం ఆరోగ్యంనుంచి నిన్ను చెరుతెలంపుల మంచాన పడగొట్టు. నా మాటవిని ఈ ఆలోచన ఇక అరికట్టు.

మనమడు:

నీదంతా చేదస్తం
పిల్లలకు చదువే సమస్తం
అమ్మవద్దకు వెళ్ళి
చదువుకో నివ్వమని
జీవితంలోకి ఎదగనివ్వమని
ప్రార్థిస్తాను
ప్రాధేయపడతాను.

కొడుకు:

అమ్మా అమ్మా
తాతయ్యంటాడూ
చదవొద్దంటాడు
నువు చెప్పమ్మా
తాతకు నాన్నకు
అది తప్పని చెప్పమ్మా.

తల్లి:

ఏమిటేమిటి...ఇంకా చదువుతావా
ఏమండోయ్ ఇది విన్నారా...ఈ విడ్డూ
కన్నారా...అసలే అన్నంలేక అఘోరి
ఉంటే పరమాన్నంకోసం పరవళ్లు త్రొ
తున్నాడు. అసలు మీరిటు రారేం...
వినరేం...మీ చిన్నబ్బాయి ఇంకా ఇం
చదువుతాడట ... కొంపేమో ఓ మూ

 

# రతనాల తండ్రి



కంగలో కలుస్తూఉంటే ఏడికి కుంతైనా తెంగలేదు చూడండి......ఇంకా ఇంకా చదువుతాడట. వెలిగిస్తున్నాడుగా అన్నయ్య ...చదివి చదివి మేష్టరుగిరి......తెగబలిసి పోతోంది సిరి...కట్టుకోడానికో చీరాలేదు ...చలి దచ్చిన జివ్వాకు ఓకూరా లేదు. ఎన్నాళ్లు చూసినా ఇలాగే ఉంది. ఎన్నేళ్లు చూసినా ఇలాగే ఉంటుంది. మరి అలాగే ఉంది ఈకోడలమ్మ. చిట్టచిట్టారుకొమ్మ... నునులేతరెమ్మ...కొంచెమైనా మారదు... వనంటే అసలు చేరదు...చేయి కదపడం గాని, నడుం వంచడంగాని ఎరగనే ఎరగదు ... చేతులు చూసుకొని, నడుం చూసుకొని తెగ మురిసిపోతుంది. తెగ మిడిసి పడుతుంది. ఆ వెర్రిబాగుల మొగుణ్ణి వెంటేసుకొని షికారు తిప్పుకోడమే దానిపని. ఛీఛీ ఇదేం సంసారం...ఏమిటి దీంట్లోని సారం... అయ్యో తెలకొరిగిపోతూన్న ఈ కొంగరాన్ని ఎలా తిరిగి తిరిగేట్టు చేయాలో తోచడంలేదు. అది పడిపోకుండా తిప్పడం ఎలాగో తెలియడంలేదు. చాలు నాయనా చాలు; ఈ చదివింది చాలు. చదివి చదివి చప్పరించకు మా బ్రతుకు.

కొడుకు: (తనలో) అప్పే అమ్మకేమీ తెలియదు. ఆమెగొడవ ఆమెదేకాని ఇతరులమాట వినదు. అన్నయ్యదగ్గరకు వెళ్ళి జీవితంలోకి ఎదగనివ్వమని నాన్నకు సిఫార్సు చెయ్యమని చెపుతాను. వింటాడో చూస్తాను.

అన్నయ్యగదివద్ద తమ్ముడు: అరె తలుపు వేసేసి ఉంచే...వదిన అన్నయ్యతో ఏమిటేమిటో అంటున్నదే. అయితే వినబడే మాటలు వినడంలో తప్పేముంది? ఆఁ... ఏమిటీ...

వదిన: నా ఆకలి కళ్లకు సినిమా అన్నం పెట్టు. నా ఎండిపోయిన చెవులకు సంగీతం మంచినీళ్లుపట్టు. నా చెక్కిళ్ళ పాపుచేసే చక్కని స్నోబుడ్డి తాకి కొనిపెట్టు. నా ఈ రోజాపూల అందాన్ని ఏపుగా పెంచే పౌడరుడబ్బీ ఎరువు నిప్పుడే తెచ్చిపెట్టు. తళతళ్తుక తిరిగేచీర వెల ఎంతైనా వేగమే తెచ్చి కట్టపెట్టు. అలా చేస్తావని చేతిలో చేయివేసి ఒట్టుపెట్టు. లేకపోతే నన్నెందుకు పెళ్లాడినట్టు?

అన్నయ్య:
ఇంతేనా ఇంతేనా...నువ్వనేది
అర్థంచేసుకోనా నేననేది...
అబ్బబ్బ! మువ్వోక తోటలువు
సహావుగా స్వరాలు పలకలేని ఫిడేలువు
అర్థంలేని అనుకరణవు
జీవితానికి పనికిరాని ప్రచురణవు

గుమ్మం అవల తమ్ముడు:
వదిన ఎట్లా మాట్లాడింది...అన్నయ్య
చెప్పింది ఎంత బాగుంది...
అయితే పట్నం పోలిక ఇంట్లో
ఉండనే ఉంది...సరే కాని
నాన్న దగ్గఱకూ వెళ్తాను
చదువుకోవడం ఎలా తప్పంటాడో
చూస్తాను...

తండ్రి:
తాతయ్య అంతా చెప్పాడు. ఔను. తాతయ్య అన్నది నిజమే! ఈ నా సంగతి నీకు తెలియందేముంది. ఏనుగుకి ఏనుగు పిల్లలు. మేకకు మేకపిల్లలు. అలాగే అలాగే గుమస్తాకు గుమస్తా పిల్లలు. నిన్ను చదివించే నా తాహతు వెన్నెముక ఏనాడో విరిగిపోయింది. ఈ అసమర్థుని కడుపున ఎందుకు పుట్టావు నాయనా...'ఆకలేస్తూందే' అన్న బిడ్డకు అన్నం పెట్టలేని తల్లిబాధ అర్థం చేసుకో తండ్రీ...అర్థంటు పేడలులాగ ఎదుర్తంటు ఖర్చులు. లేలని ఎక్కౌంట్లులాగ తెగతెంపులు కాని-తెగుళ్లు. ఎప్పటికీ క్లోజు కాని ఫైళ్ళలాగ ఎప్పటికీ అంతం కాని అప్పుల లైళ్ళు. చెదిరింపుల మొహాల్లాగ మాడలేతించే మీ మమ్మ అరవుల రైళ్ళు... చెత్తకార్నసు పేపరుపై తీసిన అఖరు కాపీ మీద కనిపించీ కనిపించని అక్షరాల్లాగ—ఈ కనిపించీ కనిపించని కర్మ! ఇదే నాయనా నా జీవితం. ఇదే......ఇదే నా జీవితం...




బంగారమ్మ తెల్లవారినప్పటినుండీ కిటికీలో తలపెట్టి చూస్తున్నది. రెండు స్టేషనులు దాటినా బట్లరు కాఫీ తీసుకొని రాలేదు. కాఫీకొరకు ఎదురు చూడటములో ఎప్పుడో ఆమెకు కన్ను మలిగింది. పెట్టె ఖాళీగా కూడా ఉన్నదేమో - కాళ్లు చాపుకొని తలక్రింద చెయ్యి పెట్టుకొని పడుకున్నది.

ఆమెకు నిద్రలోకూడా అప్పుడప్పుడు కలుగుతూ వచ్చిన మెలకువలో - వేళకు కాఫీ అందలేదని తలనొప్పి జ్ఞాపకము చేస్తూ వచ్చింది. రైలుకుదుపుకు కన్ను వాటంతట అవే మూతలు పడిపోతున్నాయి. రైలు ఎన్ని స్టేషనులు దాటివచ్చిందో ఆమె గమనించలేదు. ఆమెకు మెలకువ వచ్చేటప్పటికి పెట్టె కొంత సందడిగా ఉన్నది. ప్రయాణీకుల మాటలు స్పష్టముగా వినబడుతున్నాయి.

“ఆమెకు వయసు ఎంత ఉంటుందనుకుంటావు?”

“పాతికేళ్లు ఉంటాయేమో!”

“ఆఁ! అట్లా కనబడుతుందిగాని ఇంకా ఎక్కువే ఉంటాయని నా ఊహ”

“అవునులే. ఈ రోజుల్లో ప్రతివాళ్ళు ముఖముమీది ముడతలు కనబడకుండాను - జుట్టు నెరవకుండాను జాగ్రత్త పడుతుంటే ఎదటివాళ్లు ఏం తెలుసుకోగలుగుతారు?”

“మనము ఇంకో సంగతి గమనించాలి. ఈకాలములో పదిహేనేళ్లకే తల నెరసిన

## ఇల్లిందల సరస్వతీదేవి

వాళ్లుకూడా ఉన్నారు. వాళ్ల సంగతేమిటంటారు?”

ఆ సంభాషణ ఎవరినిగురించి అయినదీ ఆమెకు స్పష్టముకాలేదు. కాని ఇంకా ఏమి చెప్పుకుంటారో నన్న కుతూహలము మాత్రము కలిగింది. నిద్రపోతున్నట్లుగా పడుకున్నది.

ఆమెకు మెలకువ వచ్చినట్లు వాళ్లు గ్రహించి ఉండాలి. తరువాత గుసగుసలు తప్ప మాటలు ఆమెకు వినపడలేదు.

అంతలో బట్లరు వచ్చి పిలిచాడు. ఆమె దిగ్గున లేచి కాఫీ అందుకున్నది. తలవంచుకునే చేతిసంచీ తెరచి వక్కపలుకు నోట్లో వేసుకుంటూ తన తోడిప్రయాణీకులు నలుగురు ఉన్నట్లు గ్రహించుకున్నది. వాళ్లల్లో ఒకాయన సూటు వేసుకున్నాను, మిగతా వాళ్లు దేశీయ వేషధారణలో ఉన్నారు. ఆమె లేచి కూర్చోగానే వాళ్లందరూ జాగ్రత్తగా సర్దుకొని పెద్ద మనుష్యులవలె మర్యాదగా కూర్చున్నారు.

గాలి నిండుగాఉన్న సైకిలు టైరులాంటి తన దేహాన్ని ఆమె ఒకసారి తల యెత్తకుండా కలయజూసుకున్నది. చేతి బంగారు గాజులకాంతి దేహకాంతులలో కలిసిపోతూ ఉండటాన్ని పదేపదే చూసుకొని మురిసిపోయింది. వయసును లక్ష్యముచేయని తన దేహ దారుఢ్యాన్ని బంగారమ్మ క్రీగంట గమనించుకున్నది. వెంటనే ఆమెకు ప్రయాణీకుల సంభాషణ జ్ఞాపకము వచ్చి దేహము జలదరించింది. ఆమె దానిని పైకి కనబడనీయకుండా సర్దుకుంటూ కిటికీలో తలపెట్టుకొని చూడటము మొదలుపెట్టింది.

ఉదయము ఎనిమిది గంటలు దాటుతున్నది. రైలు అతి వేగముతో విసురుగా వెళుతున్నది. బంగారమ్మ తోటి ప్రయాణీకులు వాళ్ళల్లో వాళ్లయినా మాట్లాడుకోకుండా - కదలకుండా - కూర్చున్నారు.

బంగారమ్మకు ఈ వాతావరణము అతి ధారావ్రతములా కనిపించింది. ఆమె కేటూ తోచక తోలుసంచీ తెరచి మరికొన్ని వక్కపలుకులను నోటికందించుకుంటూ ఉండగా - రైలు అకస్మాత్తుగా ఆగింది. చాలామంది ప్రయాణీకులు రైలు దిగి ఇంజనువైపు పరుగెత్తారు. బంగారమ్మ పెట్టెలోనుంచి కూడా ఇద్దరు ప్రయాణీకులు దిగివెళ్ళారు. మిగతా ఇద్దరూ అద్దాలో కిటికీలలో తలలుపెట్టి చూస్తున్నారు. చూడటానికి వెళ్ళేవాళ్లు వెళ్లుతూ ఉంటే - చూసి వచ్చేవాళ్లు వస్తున్నారు.

‘పాపము చిన్నవయసుదే - తల బాగా చితికిపోయింది. దేహము చూస్తే పాటకజనములో మనిషిలా లేదు’ అనుకుంటూ పోతున్నారు.

ఒకగంట తరువాత మృతదేహాన్ని తొలగించి రైలు కదలటానికి ఏర్పాట్లు జరిగాయి. ప్రయాణీకులు ఎవరి స్థలాలలో వాళ్లు కూర్చున్నారు.

“పాపము! ఆ మనిషి ఎవరో - ఎట్లా పడ్డదో - ఎందుకు పడ్డదో!” అన్నాడొక ప్రయాణీకుడు. ఆయన ఆ దృశ్యము చూడటానికి స్వయముగా వెళ్ళకపోవటమువల్ల చూసినవాళ్ళను అడగటము మొదలుపెట్టాడు.

---

ఈ జీవితం యజమాని చేతిలో నెలకు సుమారు నూరు రూపాయలుమాత్రమే ఇవ్వగల చెక్కుబుక్కును... ఈ సంసారం, ఆఫీసులనే అడకత్తెరలో దుర్భరంగా నలిగిపోతూన్న ఓ పోకచెక్కను... ఈ కష్టాల నిరామరకల్ని జీర్ణించుకున్న ఓ నిరుపేద అద్దు పేపర్ను!

కొడుకు: నాన్నా నాన్నా ... ఇక చెప్పకు నాన్నా...నీ బాధ నా కవగతమయింది. మన జీవితం పదిహేడో ఎక్కమని అర్థమయింది. సాధన చేస్తేగాని ఈ జీవితం సాధ్యంకాదు. ఔను నాన్నా ఔను. తాతయ్య అన్నది నిజమేను. నేల కొరిగిపోతూన్న, ఈ బొంగరాన్ని ఇక నేనే నిలబెడతాను. మిమ్మల్ని కేంద్రంగా ఆధారం చేసుకొని, మీ జవసత్వాల ఆకర్షణలతో తిరిగిన ఈ ఇంటిలోని మెంబర్ల బొంగరాల కూటమి ఇక నన్ను కేంద్రంగా ఆధారం చేసుకొని వాయువేగ మనోవేగంతో తిరుగుతాయి. సంసారయాత్ర సుఖంగా సాగిస్తాయి. అనంతంగా అవరోధాలు లేకుండా ప్రయాణిస్తాయి.

తాత: బాగుందిరా బాగుంది. పోకిరీ పనులకే అలవాటుపడ్డ పరమాణువులకు, చాకిరీ ఎల్లా చేయాలో మప్పగల చాకచక్యం ఉందిరా నీకు!

తల్లి:
నా రతనాల తండ్రి
నా రతనాల తండ్రి!



#  అనాశ్వాసిత 

"ఆ ప్రశ్నలు మమ్మల్ని అడిగితే మాకేం తెలుస్తుంది? ఏదో పెళ్లాము - అందరితో పాటు చూసివచ్చాము. తలంతా చితికిపోయింది" అన్నాడు పెళ్ళిచూసి వచ్చిన ఒకాయన.

"ఆ మనిషి వయసు ఎంత ఉంటుంది?" ఏదో కిటుకు తెలిసిన వాడి వలె ప్రశ్నించాడు మొదటి ప్రయాణీకుడు.

"ఏమో! ఆడవాళ్ల వయసు చప్పున చెప్పటము కష్టము. ఏమంత చిన్నదీ కాదు. ఏమంత పెద్దదీ కాదు" తన మామూలు ధోరణిలో అంటూ తటాలున బంగారమ్మను చూసి నాలుక కొరుక్కున్నాడు.

ఈ సంగతి గ్రహించని మరొకాయన "పిల్లలుకూడా ఉన్నారుట. వాళ్ళను వదలిపెట్టి రైలుక్రింద పడటానికి ఎంత ఇబ్బంది వచ్చిందో?" అన్నాడు.

వాళ్ల సంభాషణ దానంతట అదే ఆగిపోయింది. రైలు మరొక స్టేషనులో ఆగింది. అక్కడ ఇద్దరు స్త్రీలు ఎక్కారు. ఎక్కిన రెండు నిమిషాలకే 'ఏ ఊరు వెళ్లుతున్నా రన్నది ఒకావిడ బంగారమ్మను చూసి. బంగారమ్మ చెప్పింది.

"అక్కడ ఎవరున్నారు?"

"మా అమ్మాయి ఉన్నది" ఆ మనిషి ముఖము చూడకుండా ముభావముగా అన్నది బంగారమ్మ.

"అయితే అమ్మాయి అక్కడ ఏంచేస్తున్నది? పెళ్లయిందా?" ఎంతో అవసరము ఉన్నట్లుగా - బంగారమ్మ జవాబు ఇచ్చి తీరాలన్నట్లుగా అడిగింది.

"మా అమ్మాయికి పిల్లవాడు. వాడి పుట్టిన రోజుకే నేను వెళ్లుతున్నాను" జవాబు చెప్పటము యిష్టము లేకపోయినా కనుబొమలు ముడివేసుకుంటూ జవాబిచ్చింది బంగారమ్మ.

ఆమె విస్మయపడి "మనమడికి పుట్టిన రోజా? మిమ్మల్ని చూసినవాళ్లు మీకు మనమలు ఉన్నారంటే నమ్మరు" తానేదో క్రొత్త విషయాన్ని తెలుసుకున్నట్లు ముఖము పెట్టి, నవ్వుతూ అందరి ముఖాల వంకా చూసింది.

ఈ సంభాషణను శ్రద్ధగా ఆలకిస్తున్న మగ ప్రయాణీకుల ముఖాలలో విస్మయము కనబడ్డది. వాళ్ళల్లో ఒకాయన 'నేను అప్పుడే అనుకున్నా. మీతో మాదసగా అన్నానుకూడాను' అన్నట్లు అందరివంకా చూశాడు. మగ ప్రయాణీకులలో అకస్మాత్తుగా మాటలు లేని సందడి ప్రారంభమైనది. మొదటినుండీ మాటలో ఉనికిలో వాళ్లు నిలుపుకొంటూవచ్చిన గాంభీర్యము మర్యాద సడలిపోయింది. వాళ్లలో వాళ్లు అతి చౌకరకపు హాస్యముతో అతిగా సంభాషించుకోవటము మొదలుపెట్టారు. చదివేసిన పత్రికలను అజాగ్రత్తగా పెట్టెలో దొర్లనిచ్చారు. ఈ మార్పును బంగారమ్మ గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు. ఆమెకు ఇది రుచించక మనసులో వికారపెట్టింది. ఒక విధమైన అసహ్యము కలిగింది.

ఇది జరిగిన తరువాత సరిగా ఇరవై నిమిషాలపాటు ఆమె రైలులో కూర్చున్నది. స్టేషను రాకముందే సామానులన్నీ ఒకచోటికి చేర్చింది. రైలు ఆగగానే తప్పనదిగిపోయి దూరముగా నిలబడ్డది. ఒక యువకుడు వచ్చి సామానులన్నీ దింపించుకున్నాడు. రైలు కదులుతూ ఉండగా తోడి ప్రయాణీకురాలు "పిన్నిగారూ! ఆయన మీ అల్లుడా?" అని గట్టిగా కేకవేసి అడిగింది. బంగారమ్మ ముక్కు చిట్లించి ముఖము ప్రక్కకు తిప్పుకున్నది.

వాకిటిముందు బండి ఆగగానే కూతురు ఎదురుగావచ్చి తల్లిని లోపలికి తీసుకొని వెళ్ళింది. ఇంటినిండా బంధువులు కిటకిటలాడుతున్నారు. ఆడుకుంటున్న పిల్లవాడిని కూతురు ఎదురుగా తీసుకొని వచ్చింది. బంగారమ్మ వాడిని పలకరించకుండానే పెట్టెతీసి బిస్కట్ల డబ్బా చేతికిచ్చింది.

దాని నందుకొని పిల్లవాడు పరుగెత్తాలని చూశాడు. కూతురు పట్టుకొని ఆపి "అమ్మమ్మరా వచ్చింది! అట్లా పారిపోతావేం?" అని కోపము చేసింది.

బంగారమ్మ మనస్సు చురుక్కుమన్నది.

పరధ్యానముతో భోజనాలయిన తరువాత సాయంత్రము అయిదుగంటలవరకూ పడుకొన్నది. కాఫీ త్రాగుతూ ఉండగా కూతురువచ్చి దగ్గరగా కూర్చున్నది. తెల్లవారితే పుట్టినరోజు పండుగ. పెద్ద విందు జరుగబోతున్నది. అతిథులు ఎంతోమంది రావలసిఉన్నది. వివరముగా తల్లితో చెప్పుతూ "మీ అల్లుడు చాలా సరదా పడుతున్నారమ్మా. పెద్ద ఎత్తులో దీనిని తలపెట్టారు. నాకేమీ తెలియటములేదు. రేపటి సంగతంతా నీవే చూసుకోవాలి." అన్నది.

బంగారమ్మ విని ఊరుకున్నది. అంతలో పిల్లవాడు వచ్చాడు. ఉదయము ఇచ్చిన బిస్కట్లు తాను తినగా మిగిలినవి స్నేహితులకు పంచియిచ్చాడు. వాటిరుచి తెలుసుకున్న తరువాత అమ్మమ్మను మళ్ళీ మంచి చేసుకుందామని వచ్చాడు. పిల్లవాడు రాగానే తనతల్లి దగ్గర కూర్చుండ పెట్టుకుంటుందని కూతురు అనుకున్నది. బంగారమ్మ ఆ వైపే చూడలేదు. కూతురు ఊరుకోలేక "ఎందుకురా అమ్మమ్మదగ్గరగా వచ్చి నిలబడ్డావు? మళ్ళీ బిస్కట్లు ఇస్తుందనుకున్నావా?" అని పిల్లవాడిని మందలించి "చూడవే అమ్మా! వీడి కొంటెతనము?" అని దగ్గరికి తీసుకున్నది.

బంగారమ్మ పొడినవ్వు నవ్వింది.

రాత్రి కూతురు అల్లుడితో అంటున్నది "మా అమ్మలో చాలా మార్పు వచ్చిందండీ. ఎవరితోనూ మాట్లాడకుండా ముభావముగా ఉంటున్నది. మధ్యాహ్నము నేను ఎంతోసేపు దగ్గరకూర్చుని రేపటి ఏర్పాట్లనుగురించి అడిగితే ఒక్కదానికైనా సమాధానము యివ్వలేదు."

"అంత యింట్లో ఒక్కతే ఉండలేక దిగులు పడిపోయినట్లుంది. పోనీ మనదగ్గరే ఉండిపొమ్మను" అన్నాడు అల్లుడు.

ప్రయాణపు బడలికలో ఉండికూడా బంగారమ్మ ఈ మాటలను శ్రద్ధగా ఆలకించింది.

మరునాడు బంగారమ్మ లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని ఏర్పాట్లన్నీ స్వయముగా చేసింది. పిల్లవాడికి తాను తెచ్చిన బహుమతులన్నీ ఇచ్చింది. కూతురు చూస్తూ ఉండగా పిల్లవాడిని దగ్గరికి తీసుకున్నది.

బంగారమ్మకు ఈ కూతురి తరువాత సంతానము లేకపోవటమువల్లనూ - ఉన్న పిల్ల కాస్తా అత్తవారింటికి వెళ్ళిపోవటము

చేతనూ - దంపతులు ఇద్దరే ఉండవలసి వచ్చింది. చూసేవాళ్ళకు ఆ దంపతులు కొత్తగా గృహస్థాశ్రమములో ప్రవేశించిన ట్లనిపించేది. మాతృధర్మము దైహికముగా గాని, మానసికముగా గాని, ఆమె కెక్కువ వత్తిడి చేయలేదు. అందుకు పెనిమిటి ఉద్యోగరీత్యా ఏడాదికొక ఊరు తిరగటముకూడా అనువైంది. ఎక్కడికి వెళ్ళినా 'ఆమె ఎట్లా ఉన్నదో చూడు' అని అందరూ అంటుంటే ఆమెకు మరీమరీ వినాలనిపించేది. ఆ మాటలు ఆమె కెంతో ఉత్సాహాన్ని ఇచ్చేవి. తరువాత ఆమె వితంతువైనా ఆ దుఃఖభారమువల్ల ఈ భావాలు అంతరించిపోలేదు. అందుమంచి ఆమె తన అలంకారాలన్నీ తీసివేయలేదు; ఆకారము వికారముగా లేదు.

బంగారమ్మ మెరూనురంగు బార్డరు చీర కట్టుకున్నది. అతిథులను లోపలికి ఆహ్వానిస్తూ - వాళ్ళతో మాట్లాడుతూ - చాలా ఉత్సాహముగా తిరిగింది. అందరూ పిల్లవాడిని బహూకరించి దీవించారు. విందు ఘనంగా జరిగింది. అతిథులందరూ వెళ్ళటము మొదలు పెట్టారు. వెళ్ళుతూ ఒకావిడ "మీ అమ్మగారు వస్తారని చెప్పితివే - వచ్చారా?" అని కూతురిని అడిగింది.

కూతురు తల్లిని అందరికీ పరిచయము చేసింది.

"మీరేనా పిల్లవాడి అమ్మమ్మ! ఇంకా ఎవరో ననుకుంటున్నాను సుమా! మనమడు అచ్చు మీ పోలికే. మీరు ఏమీ అనుకోకండేం? మీకు మనమడు ఉండవచ్చునన్న ఊహ అయినా మాకు తట్టలేదు" అన్నారు ఇద్దరు ముగ్గురు ఆశ్చర్యపడుతూ.

కూతురు నవ్వింది. వాళ్ళ కెంత ఆశ్చర్యము కలిగిందో బంగారమ్మ మనసంత క్రుంగిపోయింది. హృదయమెంతో భారమనిపించింది.

రాత్రి భోజనాలైన తరువాత బంగారమ్మ దొడ్లో గాలికి ఒంటరిగా వెళ్ళి కూర్చున్నది. ఆమెను వెదకుతూ అల్లుడి తలిదండ్రులు కూడా అక్కడికే వెళ్ళి కూర్చున్నారు, పగటివిందు విశేషాలు మాట్లాడుకుంటున్నారు.

పిల్లవాడు అక్కడికి తప్పటడుగులు వేస్తూ ఒక పెద్ద ఏనుగుబొమ్మను ఎత్తుకొని వచ్చాడు. వచ్చీరానిమాటలు మాట్లాడుతూ ఎదురుగా నిలబడ్డాడు.

బంగారమ్మకు వాడిని చూడగానే ముద్దనిపించింది. ప్రేమతో వాడివంక చూసింది. దగ్గరికి రమ్మని చేతులు చాపింది.

అంతలో తాతగారు "అబ్బాయీ! ఆ బొమ్మ నా కిస్తావురా?" అన్నారు.

"నీ కియ్యను. అమ్మమ్మ కిస్తా"నన్నాడు.

ఏ పురుగో కుట్టినట్టుగా - చాచిన చేతులను బంగారమ్మ దప్పున వెనుకకు లాగుకొన్నది.

మరునాడు బంధువులందరూ వెళ్ళారు. బంగారమ్మను కూతురు వెళ్ళనివ్వలేదు.

అంత వైభవముగా పుట్టినరోజు జరిగిన వారానికే పిల్లవాడికి పెద్దజ్వరము వచ్చింది. నాలుగుదినాలయినా తిరుగుముఖము కాలేదు. డాక్టరు మందు ఇస్తున్నాడు. కూతురూ అల్లుడూ చాలా భయపడిపోయారు. ఒకరాత్రి పిల్లవాడికి మరీ ఎక్కువ చేసింది. పిల్లవాడి తల్లిని సమాధానపరచటము చాలా కష్టమైపోయింది. కూతురు పడుతున్న బాధకు బంగారమ్మ తల్లడిల్లిపోయింది. కూతురిని ఊరడించాలనీ - తన హృదయానికి హత్తుకోవాలనీ ఆమె మనసు ఆరాటపడ్డది. తీరా గదిముందరికి వచ్చేసరికి పిల్లవాడు 'అమ్మమ్మా!' అని పిలిచిన పిలుపు వినబడ్డది. ఎవరో తనను తరిమి వేసినట్లుగా బంగారమ్మ ఆ గదిలోనుంచి పరుగెత్తింది. కూతురు గదిదాటి ఇవతలికి వచ్చిన తరువాత బంగారమ్మ ఆమెను కౌగలించుకొని ఏడ్చింది. తన కూతురు కంటినిండా నిద్రపోయి - కడుపునిండా అన్నము తిని వారము దినాలు కావచ్చింది! బంగారమ్మకు దుఃఖము పొంగుకుంటూ వచ్చింది.

ఆరాత్రి డాక్టరు పిల్లవాడిని చూడటానికి వచ్చి "పిల్లవాడిదగ్గర తల్లిని ఎప్పుడూ ఉండనీయకండి. అట్లా ఉంటే ఆమె కేదయినా జబ్బు చేస్తుంది" అన్నాడు.

కూతురు పడుతున్న ఆవేదనను బంగారమ్మ చూడలేకపోయింది. మనసు చిక్కబట్టుకొని పిల్లవాడిదగ్గర కూర్చున్నది. పిల్లవాడు కళ్ళుమూసుకొని పడుకున్నాడు. మందు వేళయింది. లేపి ఇవ్వటము మంచిదా - కాదా అని మందు సీసా చేత బట్టుకొని ఆలోచిస్తూ గడియారమువంక చూస్తున్నది.

"అమ్మమ్మా!" పిల్లవాడు హీనస్వరముతో పిలిచాడు. బంగారమ్మ మనసులో ముళ్ళకంప కదిలినట్లయింది.

వచ్చినప్పటినుండీ పిల్లవాడు ఆ చిన్న ఎర్రటి పెదవులతో తేనెలొలికిస్తూ మాట్లాడుతూ ఉంటే ఆమెకు హృదయంగమముగానే ఉన్నది. కూతురు ఆ పిల్లవాడిని చూసుకొని మురుస్తుంటే ఆమె హృదయములో ఆనందము వెల్లువలై పారేది. తన పెనిమిటి దురదృష్టవశము చేత ఈ ఆనందాన్ని అనుభవించలేకపోయినాడు. తాను చూసి ఆనందిస్తున్నది. కాని ఆ పిలుపు - 'అమ్మమ్మా!' అన్న ఆ పిలుపు - ఆమె గుండెలో చిచ్చుపెట్టినట్లవుతున్నది. మనమలను ఎత్తుకోటాన్ని అందరూ ఎంతో అదృష్టముగా ఎంచుకుంటారు; కాని ఆభావము బంగారమ్మ ఎదలో జ్వాలలను రెచ్చగొడుతున్నది. పిల్లవాడు మళ్ళీ "అమ్మమ్మా!" అన్నాడు జాలిగొలిపేటట్టుగా చూస్తూ.

బంగారమ్మ అదిరిపడి తన దేహాన్ని క్రిందినుంచి మీదివరకూ ఒక్కసారి చూసుకున్నది. పిల్లవాడు పిలిచే ప్రతి పిలుపులోనూ ఆమె దేహదారుఢ్యమును యౌవనమును నశింపచేసే శక్తి ఉన్నట్లుగా ఆమెకు తోచనారంభించింది. పటిష్ఠముగా ఉన్న ఆమె దేహము ముడతలుపడి, నరములు పైకి తేలినట్లే నిండుగా ఉన్న ఆమె చెంపలు గుంటలు పడినట్లే - గట్టిగా తెల్లగా ఉన్న పళ్ళన్నీ ఊడిపోయినట్లు బోసిపోయినట్లే - నల్లగా నిగనిగలాడే ఆమె కురులు నెరసినట్లే - తిన్నగా ఉన్న నడుము వంగిపోయినట్లే — భావపరంపర ఆమె మనసులో దొరలిపోయింది. చేతివేళ్ళు పట్టుతప్పి మందుసీసా చేతిలోంచి జారి నేలమీదపడ్డది.

ఆ చప్పుడు విని అదిరిపడి కూతురూ అల్లుడూ పరుగెత్తుకొని వచ్చారు. బంగారమ్మ దేహము వణుకుతూ ఉండగా చూసి కూతురు తల్లిని గదిలోనుంచి బైటికి తీసుకొని వచ్చింది.

రెండుదినాల తరువాత పిల్లవాడికి కొంత నెమ్మదించింది. కూతురూ అల్లుడూ మామూలుగా మాట్లాడుకుంటూ ఉదయపువేళ పిల్లవాడి మంచముదగ్గర కూర్చున్నారు. 'తల్లి కాఫీ తీసుకొని వస్తుందిగదా' అని కూతురు ఎదురుచూస్తున్నది. ఎనిమిది గంటలు దాటింది. కూతురు లేచి తల్లిని పిలుస్తూ ఇల్లంతా వెదకింది. తల్లి పడుకునే గదిలోకి వెళ్ళి చూడగా బల్లమీద ఉత్తరము పెట్టి ఉన్నది.

"అమ్మాయీ!

మిమ్మల్ని నిద్రనుంచి లేపటమెందుకని మీకు చెప్పకుండానే వెళ్ళిపోతున్నాను. సంసారములో ఉన్న బంధాలమీద విరక్తి కలిగింది. వైద్యాలయములో నర్సుగా ఉండాలని ఎంతకాలమునుంచో నాకు కోరిక. నేను వేరే విల్లు వ్రాయనవసరం లేదు. నీ కొడుకే నా ఆస్తికి సర్వాధికారి.

బంగారమ్మ."

ఉత్తరము చదువుకొని "నా అమ్మకు బొత్తిగా ధైర్యములేదు" అన్నది కూతురు కన్నీళ్లు తుడుచుకుంటూ పెనిమిటితో. ★

# హైడ్రోజన్ బాంబూ - అనాసపండు

రాజారావు ... శ్రీమంతుడు
లీల ... రాజారావుకూతురు
శ్రీనివాసరావు ... లీలను ప్రేమించిన యువకవి
రాముడు ... రాజారావుగారి నౌకరు.

(రేడియో, హైడ్రోజన్ బాంబూ, అనాసపండూ.)

రేడియో: ఇప్పటిదాకా మీరు నిలయ విద్వాంసుల వీణా వాయిద్యం విన్నారు. ఇప్పుడు శ్రీ రావుగారు శాంతినిగురించి ప్రసంగిస్తారు.

రాజారావు: ప్రసంగం శాంతిని గురించా? శాంతిని కోరేది పిరికివాళ్లు! పరిస్థితిని ఎదుర్కోలేక శాంతి ప్రసంగాలకు దిగుతున్నారు! యుద్ధాల్ని ఎదుర్కోగలిగినవాడు ధీరోదాత్తుడు. నాలుగు డబ్బులు కళ్లజూడాలీ అంటే యుద్ధాలు అవసరం!... శాంతి! శాంతి!! - ప్రతివాడికీ ఇదో పాటయిపోయింది.

(రాజారావు రొప్పుతూ సోఫాలోనుంచి ప్రక్కకు తిరిగి రేడియోట్యూన్ కట్టివేస్తాడు.)

ఒరేయ్, రాముడూ! ఎక్కడున్నావురా పలికి చావవు? ఈ నౌకర్లతో చచ్చేరోజొచ్చింది! ఏంరా? ఏమయినా సిద్ధం చేశావా లేదా?

రాముడు: అంతా సిద్ధంచేశాను బాబుగారూ! బీట్‌రూట్ హల్వా, వెజిటబుల్ కటలెట్ – బల్లమీద వుంచానండీ!

రాజా: అయితే మరి పిలవ్వేం? (వెళ్తాడు-వంటశాల వేపుకు).

(మరోవేపునుంచి లీల వస్తుంది.)

లీల: అరే! ఎవరు రేడియో కట్టేశారు?

(రేడియో ట్యూన్ చేస్తుంది.)

రేడియోలో:...'ఇప్పుడు మానవాళి భవిష్యత్తుకే ప్రమాదం ఏర్పడింది. అణ్వస్త్రాల నిర్మాణం అధికంగా జరుగుతోంది. ఇప్పుడు మనం వాంఛించవలసింది, యుద్ధాలు కాదు-శాంతి సౌఖ్యాలు! ప్రపంచశాంతికోసం ప్రతిఒక్కరూ ప్రయత్నం సల్పాలి'......

(ఇంతలోనే శ్రీనివాసరావు గదిలో ప్రవేశిస్తాడు. లీల మొహం ఒక్కమారుగా సంతోషంతో విప్పారుతుంది.)

శ్రీనివాసరావ్: లీలా!

లీల: నువ్వొచ్చావా?

(లీల ఇంకేదో మాట్లాడబోతుండగా... రాజారావు వంటగదిలోనుంచి రాముణ్ణి తిడుతూవుంటాడు)

శ్రీ: లీలా, మీనాన్న అందరికిమల్లే కాదు!

లీల: అంటే.

శ్రీ: చాలామంది శ్రీమంతులు డబ్బు సంపాయించాలనే తాపత్రయంలో పడి తిండితింటం మానేస్తారు! కాని మీనాన్న మాత్రం ఆదాయం పెరిగినకొద్దీ బొజ్జకూడా పెంచుకుంటున్నాడు!

లీల: సరే, ఈ విషయాలకేంలే! అసలు విషయాన్నిగురించి కొంచెం మాట్లాడు!

శ్రీ: కొంచెంకాదు; పూర్తిగా మాట్లాడతాను! ఈరోజు మీనాన్నను ఖచ్చితంగా అడగదలిచాను! నిన్నుచూడంది—ఒక్కక్షణమైనా వుండలేక పోతున్నాను.

లీల: నిజంగానా? నాస్థితీ అలాగేవుంది!

శ్రీ: వాస్తవంగానా?

## దండమూడి మహీధర్

లీల: నీకు నమ్మకం కలగటంలేదా? నాహృది నీకోసం ఉవ్విళ్ళూరుతూ వుంటుంది!

శ్రీ: ఏమో! నువ్వు సినిమాడైలాగ్‌లాగా మాట్లాడుతున్నావు! సరేగాని— మీ నాన్నకు నేనంటే ఎలాంటి అభిప్రాయం వుంది?

లీల: సదభిప్రాయంలేదు; ప్రస్తుతానికి. నువ్వు 'హైడ్రోజన్ బాంబు' మీద రాసిన కవిత్వం చదివి మండిపడ్డాడు!

శ్రీ: అలాగా? దానికేంలే! ఆయనలాగే అంటాడు! నేనంటే ఆయనకెంత ఇష్టమో తెలీందేముంది? నేను మీ నాన్నతో ఒంటరిగా మాట్లాడాలనుకుంటున్నా! కాని ఆయన టిఫిన్, కాఫీ ముగియాలంటే - రెండుగంటలు పడుతుందాయె! (అప్పుడే రాముడు వస్తాడు) ఏంరా? మీ బాబుగారు తినడం పూర్తయిందా?

రాముడు: ఓవల్టీన్ తాగుతున్నారు! బజారెళ్ళి ఒక్కపరుగులో అనాసపండు తీసుకరమ్మని చెప్పారు. వెళ్తున్నా!

లీల: మా నాన్న కొంచెం భారంగా తిన్నప్పుడల్లా అరుగుదలకోసం అనాసపండు తెప్పించి తింటారు! అదంటే ఆయనకు ఎంతో ఇష్టం!...చూడు శ్రీనివాసరావు! ఒక పని చేయరాదూ?

శ్రీ: ఏంటది? నువ్వు చెప్పటం, నేను చేయకపోవటమూనా?

లీల: (రాముడితో) నువ్వెళ్లరా! అనాసపండు నేను తెప్పిస్తాలే! (వెళ్తాడు)

శ్రీ: అయితే నాకర్థమయింది! మీ నాన్నకు అనాసపండు అతిఇష్టం గనుక, అది నేను తెచ్చిఇచ్చి ఆయన్ను మెప్పించి ఆఖరున మన పెళ్ళివిషయం వాకృచ్చమంటావు!

లీల: నే ననుకున్నదంతా నువ్వే చెప్పేశావు! అయితే మరి 'సుభస్య శీఘ్రం!'

శ్రీ: నీ ఐడియామాత్రం అతి అమోఘమైంది. చూసుకో - ఆ పని నిమిషాలమీద చేసేస్తాను! (వెళ్తాడు.)

రే: "పసిఫిక్ ప్రాంతంలో హైడ్రోజన్ బాంబు ప్రేల్చడంవల్ల జపాను అనేక కడగండ్లపాలు కావడమేగాక, మొత్తం ప్రపంచానికే ఈ ప్రయోగాలు ముప్పు తీసుకరాగలవు! ప్రత్యర్థులను భయపెట్టడానికి ఇలాంటి అణ్వస్త్రాల ప్రయోగం చేయడం మానవత్వాన్ని నిరసించడమే కాగలదు...ఇప్పుడు శాంతియుత మార్గాలను అన్వేషించివాటినిఅనుసరించడంలోనే మన భవిష్యత్తు ఆధారపడివుంది...అటంబాంబులూ, హైడ్రోజన్ బాంబులూ విసురుకోవడంవల్ల - సంస్కృతి, కళలూ, సాహిత్యాలూ - అన్నీ నాశనమవుతాయి! ఆఖరుకు మానవ జీవితాలు సైతం...మసిగా మారిపోతాయి!"

రాజా: (లోపల్నుంచి వస్తూ వస్తూ!) ఎవరు రేడియో పెట్టారు? వెధవ శాంతి ప్రసంగాలు ఎవడిక్కావాలి?

(తండ్రి రావటంచూచి లీల రేడియో ఆపేస్తుంది.)

రాజా: ఎవరు, నువ్వా రేడియోపెట్టింది! విన్నావుగా ఏం చెప్తున్నదీ! నాకు నచ్చవమ్మ ఇలాంటివన్నీ! ఎవరెలా చస్తే మనకేం? గాంధీగారు చెప్పివెళ్లిన అహింసాసూత్రం మనం అమలుజరిపినన్నాళ్లు - మన దేశానికి ఎలాంటి ముప్పూ లేదు! ఏమంటావు? పైగా యుద్ధాలవల్ల మన వ్యాపారం మరింత పెరుగుతుంది.

లీల: (విమనాలో తోదక) రాముడూ! శ్రీనివాసరావు వస్తున్నాడేమో చూడు?

రాజా: అనాసపండు తెచ్చావుట్రా రాముడూ? నాకర్మతో చావొచ్చింది! చెప్పినపని చెప్పినట్లు చేయరు! తొరగా తీసుకరారా!

లీల: నీకు అనాసపండంటే చాలా ఇష్టమని శ్రీనివాసరావు తెలుసుకొని - వచ్చినవాడు వచ్చినట్లే రాముణ్ణి వద్దని తను వెళ్లాడు బజారుకు! వస్తూవుండాలి!

రాజా: ఎవరూ, శ్రీనివాసరావా? ఏదీ - హైడ్రోజన్ బాంబుమీద కవిత్వం రాశాడు. ఏం కవులు వీళ్లు? బాంబులమీద కవిత్వం రాసేమనిషి పండ్లబేరం ఏం చేస్తాడు? అతను అనాసపండు తెచ్చినట్టే, నేను తిన్నట్టే!

లీల: లేదు నాన్నా! ఆయన తప్పక తీసుకొస్తాడు!

రాజా: అసలెందుకొచ్చాడు అత నిక్కడికి?

లీల: ఏదో ఒక ముఖ్యవిషయం మీతో మాట్లాడతట్ట! (అప్పటికే రాజారావు ఆవలించి కళ్లు మూసుకున్నాడు. నిద్రపోతున్నాడని ఎంచుకొని లీల వెళ్లిపోతుంది.)

[రాజారావు స్వప్నలోకంలో విహరిస్తూ వుంటాడు. ఐదు నిమిషాలు జరిగిపోతాయి. ఇంతలోకే శ్రీనివాసరావు గబగబా లోనికొస్తాడు, బూట్లు చప్పుడు చేసుకుంటూ! రాజారావు ఉలిక్కిపడి కళ్లు తెరుస్తాడు.]

రాజా: ఎవరూ వచ్చింది? ఓహో! నువ్వా శ్రీనివాసరావు?

శ్రీ: అవును నేనేనండీ!

రాజా: అయితే, అనాసపండు తెచ్చావా?

శ్రీ: (ఏదో ఒక వస్తువుకు జేబురుమాలు చుట్టి ఎదురుగా వున్న టిపాయ్‌మీద భద్రంగా వుంచుతాడు - అది హైడ్రోజన్ బాంబూ కావచ్చు, అనాసపండూ అయి వుండొచ్చు!) తెచ్చానండీ; అత్యద్భుతమైన అనాసపండు తెచ్చాను! అయితే ఇది మీకు నచ్చుతుందో లేదో మరి!

రాజా: చూద్దాం, ఆ గుడ్డ తొలిగించూ! (శ్రీనివాసరావు కొంచెం కొంచెంగా జేబురుమాల తొలగిస్తాడు .. కాని అది అనాసపండు కాదు, హైడ్రోజన్ బాంబు) అరే అదేమిటోయ్? బాంబులాగా వుంది!

శ్రీ: సాధారణమైన బాంబు కాదండీ - ఆటంబాంబుకంటే మించిన బాంబు - హైడ్రోజన్ బాంబు!!

రాజా: ఏమిటి, నువ్వు పరిహాసమాడుతున్నావా లేక నిజంగా అది హైడ్రోజన్ బాంబేనా?

శ్రీ: మీతోనా పరిహాసాలు? లేదు, అతి వాస్తవాన్ని మీకు వెల్లడి చేస్తున్నాను. ఈ బాంబు ప్రయోగంవల్ల ఊళ్లూ, పట్టణాలూ, నగరాలూ అన్నీ సర్వం నాశనమయిపోతాయి! అప్పుడు మీ వ్యాపారం బాగా సాగుతుంది. విపరీతంగా ప్రతిదాని ధరా పెంచవచ్చు! కోట్లు గడించవచ్చు!...కాని దీని ప్రయోగంవల్ల ఎంతోమంది చనిపోతారు? ఎంతోమంది గుడ్డివాళ్లవుతారు... దేశంలో నలుమూలలా వికలాంగులు ప్రత్యక్షమవుతారు! చూట్టానికి చాలా విచిత్రంగా వుంటుంది గదండీ రాజారావుగారూ? అహా! హా!! హా!!! (నవ్వుతాడు - వికటంగా.)

రాజా: ఏమిటోయ్ ఇదంతానూ? దాన్ని కొంచెం దూరంగా వుంచు!

శ్రీ: చెప్పానుగదండీ: ఇది హైడ్రోజన్ బాంబు! ఇది మీకు చాలా ప్రియమైంది!

రాజా: ఏమిటీ అధికప్రసంగం? నీకు పెచ్చెత్తినట్లుంది! నీవిషయమేంటో నాకు పూర్తిగా అర్థంకావటంలేదు!

శ్రీ: అయితే వినండి: నేను...అంటే నేను...లీలను ... లీలను...ఏమీలేదు... ఉభయులం ప్రేమించుకున్నాం ... పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాం. మీ ఆశీర్వాదం.........

రాజా: శ్రీనివాసరావూ, నిజంగా నీకు పిచ్చెక్కినట్లేవుంది! పూరిగుడిసెల్లో పడి వుండే నీకు ఒక లక్షాధికారికూతురు లభిస్తుందా? నాకూతురిపెళ్లి నీలాంటి బికారి వాళ్ళతోనా చేసేది? గొప్ప ధనవంతుల కొడుకుచేతుల్లో పెడతాను—నాకూతుర్ని!

శ్రీ: రాజారావుగారూ! ఇప్పటిదాకా మీరు దొంగవ్యాపారాలు చేసి డబ్బు గడించారు. అలాగే మీపిల్లనుకూడా బ్లాక్‌మార్కెట్‌లో అమ్మటం ఏమంత పనిటైన పనండీ? కాని ఆఖరుసారిగా చెబుతున్నా వినండి. లీల వివాహం నాతోనే జరిగితీరాలి!

రాజా: అలా ఎప్పటికీ కానీయను! ఇది నీ పిచ్చిభ్రమ మాత్రమే!

శ్రీ: తొందరపడకండి; ఆ భ్రమ ఇంకొంచెంసేపట్లో వదిలిపోతుంది!

రాజా: అంటే?

శ్రీ: (గడియారం చూచుకుంటూ) ఇంకో పది నిమిషాల్లో మీ ఎదురుగా వుంచిన హైడ్రోజన్ బాంబు పేలుతుంది! అప్పుడు మీరూ వుండరూ, మీ కూతురూ వుండదు! మీ ఇల్లూ, మీనగరం, మీషాపులూ, మీ ఫ్యాక్టరీలు

# హైడ్రోజన్ బాంబూ - అనాసపండు

దేవాలయాలూ, అన్నీ ధ్వంసమైపోతాయి! సాహిత్య, కళాసంస్కృతులు యావత్తు సర్వనాశనమైపోతాయి! ఇది అటంబాంబు కంటె అరువందలరెట్లు శక్తివంతమైంది. ఒక్క ప్రయోగంతో పదిహేనుకోట్లమంది ప్రాణాలు ఎగిరిపోగలవు!

రాజా: పోలీసులకు ఫోన్ చేస్తాను, నిజంగా నీకు పిచ్చెక్కింది.

శ్రీ: పిచ్చెక్కింది నాకుకాదు రాజారావుగారూ! మీలాగా జీవించే ఈ సమాజంలోని శ్రీమంతులకు పిచ్చెక్కింది. తిండానికి తిండి, కట్టుకునేందుకు బట్టా, ఉండేందుకు ఇల్లూ లేక అనేకప్రజానీకం బాధపడుతూంటే—మీలాంటి వాళ్ళంతా యుద్ధాలు రావాలని కోరుకుంటున్నారు! యుద్ధసామగ్రిని తయారుచేసుకుంటూన్నారు...ప్రయోగించి చూడ్డానికి కూడా వీలులేనంతటి గొప్పగొప్ప హైడ్రోజన్ బాంబులు తయారుచేయడం ఇప్పుడు సుసాధ్యమట...అందుకని మీకో చిన్న అనాసపండు - హైడ్రోజన్ బాంబు ప్రజెంట్ చేద్దామని వచ్చాను!

రాజా: శ్రీనివాసరావూ! నాకు భయమేస్తున్నది. దీన్ని కొంచెం దూరంగావుంచు!

శ్రీ: రాజారావుగారూ! నేను అశక్తుణ్ణి. ఈ బాంబుమాత్రం ఇక్కడే పగిలి తీరుతుంది!

రాజా: నీకాళ్ళకు మొక్కుతాను... దీన్ని బయటికి తీసుకెళ్ళు...కావాలంటే ఒక వెయ్యి రూపాయలు ఈపళంగానే ఇచ్చేస్తాను!

శ్రీ: రాజారావుగారూ! నాకు డబ్బు ఒక్క చిల్లికానీ అవసరంలేదు!...నాక్కావలసింది...లీల! (గడియారం వేపు చూస్తూ) ఇంకో నిమిషంలో ఈ హైడ్రోజన్ బాంబు ప్రజ్వరిల్లుతుంది!

రాజా: శ్రీనివాసరావూ! సరే నీ ఇష్టమొచ్చినట్లు కానియ్! (స్పృహ తప్పినవాడిలా మళ్లీ పక్కమీద ఒరుగుతాడు.) లీలను పెళ్ళిచేసుకో! నా అటంకమేమీ లేదు!

(రాజారావు ఈసారి గభాలున లేచి కూచుంటాడు. ఎదురుగా అనాసపండూ లేదు - హైడ్రోజన్ బాంబూ లేదు - చివరకు శ్రీనివాసరావుకూడా లేదు—ఇంతలోకే బూట్లు చప్పుడు చేసుకుంటూ శ్రీనివాసరావు వస్తాడు; అతని వెనుక లీలకూడా వుంది. శ్రీనివాసరావు చేతిలో జేబురుమాల్లో చుట్టిన ఒక వస్తువుంది. అది అనాసపండూ కావచ్చు - హైడ్రోజన్ బాంబూ కావచ్చు! రాజారావు భయపడిపోతాడు...శ్రీనివాసరావు సమీపించిన కొద్దీ రాజారావు భయం ఉధృతమవుతుంది)

రాజా: నువ్వు మళ్ళొచ్చావా శ్రీనివాసరావ్?

శ్రీ: మళ్లా రావటమేంటి? నేను మీకోసం...

లీల: చూడు నాన్నా! నీకోసం శ్రీనివాసరావు ఎంత చక్కటి అనాసపండు తెచ్చాడో!

రాజా: నువ్వేమీ చెప్పక్కర్లేదు! నాకు విషయమంతా తెలుసు!

శ్రీ: మీకు తెలిసిందే విషయం?

రాజా: ఇది ఎలాంటి అనాసపండో నాకు తెలుసు!...సరే దాన్నలావుంచు! ఆ విషయం నాకు సమ్మతమే! చేసుకోండి మీ ఉభయులూ - అంటే నువ్వూ లీలా...

శ్రీ: నా మనోభావాన్ని మీరు ఇట్టే కనిపెట్టేశారు!

రాజా: అవును; నా కంతా తెలుసు... విషయమ్మా లీలా! శ్రీనివాసరావంటే నీకిష్టమే గదూ?

లీల: (సిగ్గుపడుతూనే) నువ్వెంత మంచివాడివి' నాన్నా!

రాజా: ఇక నేను 'బిజినెస్' చేయటం మానేయాలని తీర్మానించుకున్నా! ఇప్పటికి సంపాయించింది చాలు!

లీల: ఎంత సంతోషమైన విషయం నాన్నా! (అనాసపండు వేపు చూచి) అరే! అనాసపండు అలాగే వుంది! ఈ సంతోష సమయంలో అనాసపండు తినాల్సిందే, నాన్నా! ఇలాతే, శ్రీనివాసరావ్!

రాజా: లీలా, దాన్ని ముట్టుకోవద్దు!

లీల: ఏం? ఎందుకని?

రాజా: ఇది అనాసపండు కాదు — హైడ్రోజన్‌బాంబు!

లీల: (ఒక్కసారిగా) హైడ్రోజన్ బాంబా!

లీల: ఏంటి నాన్నా? నువ్వు స్వప్నలోకంలో లేవుగదా?

శ్రీ: అయితే సరే - హైడ్రోజన్ బాంబునే చూడండి. (జేబురుమాల తొలగించి రాజారావుముందు పెట్టడంతో ఆయన - అది హైడ్రోజన్ బాంబు కానందుకు సంతోషపడి - స్పృహతప్పినవాడవుతాడు.)

లీల: (దగ్గరగా వెళ్ళి) ఏంటి నాన్నా?

శ్రీ: (నాడి చూచి) అతి సంతోష కారణంగా ఇలా అయింది! భయపడవలసిందేమీ లేదు.

(లీల, శ్రీనివాసరావు ఒకరినొకరు ప్రేమగా చూచుకుంటారు!)

శ్రీ: సరే, పద లీలా!

లీల: ఎక్కడికి?

శ్రీ: ఎక్కడికేంటి? మన పర్ణశాలకు!

లీల: కాని ఒక షరతు!

శ్రీ: ఏంటది?

లీల: మన పర్ణశాల ఆవరణలో అనాస చెట్టు ఒకటి వుండాలి!

శ్రీ: నాదో షరతు!

లీల: ఏంటది?

శ్రీ: ఆ పర్ణశాల ఆవరణలో ఎక్కడా హైడ్రోజన్ అణువులకు బీజారోపణ జరక్కూడదు!

(ఇద్దరూ వెళ్ళిపోతారు)

(కె. వి. వి. కు కృతజ్ఞతతో)



# నైవేద్యం

వి. ఎస్. అవధాని

అటు పిల్లనిచ్చిన మామగారూ, ఇటు కన్నతండ్రీ మరణించడంతో పరంధామయ్యగారు ప్రయోజకుడయాడు. అదివరకు అప్రయోజకుడని కాదు కాని ఆయనలో బీజమాత్రంగా వున్న ఆశయాలూ, ఆదర్శాలూ కార్యరూపం దాల్చే అవకాశం లభించిందాయనకు. రెండు వైపులనుంచీ ఇరవై ఎకరాల మాగాణి భూమీ నాలుగు వేల రూపాయల రొఖ్ఖమూ ఆయన చేతిలోకి వచ్చినవి. ఇద్దరు తమ్ముళ్ళనూ ఒక బావమరదినీ ఆయన పోషించవలసి వచ్చింది.

విద్యార్థి రోజులలో ఆయన సంపాదించిన పేరు ప్రఖ్యాతుల కారణంగా స్వగ్రామంలోనే జిల్లాబోర్డు ప్రాథమిక పాఠశాల హెడ్మాస్టరు ఉద్యోగం ఆయన సంపాదించాడు.

పరంధామయ్యగారంటే మామూలు పంతులు కాదని స్వగ్రామానికేమిటి అసలు ఆ తాలూకాకే తెలిసిరావడానికి ఒక సంవత్సరంకూడా పట్టలేదు.

ఆయన ఉద్యోగానికి వచ్చేటప్పటికి ఆ వూళ్లో స్కూలు నామమాత్రంగా వుండేది. పంతుళ్ళున్నారంటే ఉన్నారు. పాఠాలు చెపుతున్నారంటే చెపుతున్నారు. పిల్లలు బడికి వెళుతున్నారు. ఇంటికి తిరిగి వస్తున్నారు. ఇక స్కూలు భవనంకూడా అంతంత మాత్రంగానే వుండేది. పరంధామయ్యగారు స్కూలుకు హెడ్మాస్టరుగా రాగానే ఆ పరిస్థితి మారిపోయింది స్కూలు అంటే యేమిటో పిల్లలకూ, గ్రామస్థులకూ, ఉపాధ్యాయులకూ కూడా తెలిసివచ్చింది.

పరంధామయ్యగారు తెల్లవారుఝామున నాలుగు గంటలకే నిద్రలేస్తాడు. కాలువలో స్నానం చేసివచ్చి గంటసేపు జపం చేస్తాడు. సరిగ్గా ఆరున్నరకల్లా బడికి వెళతాడు. ఆ స్కూలుకు ఆ రోజులలో జవాను లేదు. కనుక ఆయనే తలుపులు తీసి గదులన్నీ వూడుస్తాడు. తానే మొదటి గంట కొడతాడు. మొదటి గంట కొట్టిన అయిదు నిమిషాలకల్లా పంతుళ్ళందరూ రావాలి. ఖర్మంకాలి ఏ యిబ్బంది కారణంగానైనా యే పంతులయినా ఒక రోజు ఆలస్యంగా వస్తే, పరంధామయ్యగారు వాళ్లను ఏమీ అనకపోయినా వాళ్ళకే ఏదో బాధ కలిగేది. ఇక క్లాసులో పిల్లలకు చదువు చెప్పడం విషయంలో పరంధామయ్యగారికి ఒక ప్రత్యేకత ఉన్నది. పంతుళ్ళను అగౌరవపరచడం కాదు గాని, ఎలిమెంటరీ స్కూళ్ళల్లో చాలామంది పంతుళ్లు పిల్లలకు చెప్పవలసిన పాఠాలను ఇంటివద్ద చదవరు. పరంధామయ్యగారు అలా కాదు. ఆయన పిల్లలకు చెప్పవలసిన పాఠాలన్నీ శ్రద్ధగా చదువుతాడు. మనకు తెలిసిన విషయాలన్నీ పిల్లలకు కూడా తెలిసేటట్లు చెప్పడమే విద్యాబోధన. అందుకని ఆయన ఎప్పుడూ క్లాసులో పిల్లల ఎదుట పాఠం చదవడు. పాఠంలోని విషయాలపై పిల్లల దృష్టిని ఆకర్షించడానికిగాను తమాషా తమాషా ప్రశ్నలు వేస్తాడు. కొందరు పిల్లలు కొన్ని ప్రశ్నలకు సరయిన జవాబులు చెపుతారు. ఆ ప్రశ్నల సహాయంతో ఆయన పాఠంలోని విషయమంతా పిల్లలచేతనే చెప్పించి ఆతరువాత పిల్లలను ఆ పాఠం చదవమంటాడు. ఈవిధంగా పిల్లలకు పాఠం చెప్పే విషయంలో పరంధామయ్యగారు ఒక ప్రత్యేకతను సంపాదించాడు. ఆయన సంగతి తాలూకాలోని ఉపాధ్యాయులందరికీ తెలిసింది. మొదట్లో మొదట్లో ఆయన బళ్ళోపని చెయ్యడానికి కొంతమంది ఉపాధ్యాయులు జంకేవాళ్లు. కాని, తీరా ఆయనతో పరిచయం ఏర్పడ్డ తరువాత వాళ్ళకు కూడా ఆయన పద్ధతే నచ్చేది.

అంతే కాదు. పిల్లలందరిచేత పంతులు పరంధామయ్యగారు ప్రొద్దుట పూట, సాయంకాలం వేళ వ్యాయామం చేయించేవాడు. పొద్దుటిపూట ఏడుంపావుకల్లా ప్రార్థన చేయించేవాడు. పిల్ల లందరూ స్నానం చేసి బడికి శుభ్రంగా రావాలి. స్నానం చెయ్యని పిల్లలచేత బడిలోనే తోటబావివద్ద స్నానం చేయించేవాడు. వీటన్నింటికంటే విచిత్రమేమిటంటే పలకలు లేని పిల్లలకు పరంధామయ్యగారు పలకలు కొని ఇస్తాడు. పుస్తకం లేని వాళ్ళకు పుస్తకాలు కొనిఇస్తాడు. హరిజనుల పిల్లలకు గుడ్డలు కొనిఇస్తాడు. ప్రతి శనివారం సోమవారం పిల్లలకు తినుబండారాలు పంచిపెడతాడు.

వీటన్నింటివల్లా ఇటు గ్రామస్థులకూ, అటు పిల్లలకూ ఆయనంటే ఒక రకమైన భక్తీ, గౌరవం యేర్పడడంలో ఆచ్చర్యం యేమిటి? పరంధామయ్యగారి కృషి రాణకు వచ్చింది. ఇన్‌స్పెక్టర్లు ఆయనను ప్రశంసించారు. జిల్లాబోర్డు ప్రెసిడెంటు ఆయనను మెచ్చుకున్నాడు. పిల్లలసంఖ్య పెరిగింది. ఆ పురాతన కాలపునాటి కొంప బడికి చాలకపోయింది. పైగా అయిదేండ్లలో ఎలిమెంటరీ స్కూలల్లా హాయర్ ఎలిమెంటరీ స్కూలయింది.

ఎలాఅయినా స్కూలుకు సొంత భవనం ఏర్పాటు చెయ్యాలన్న పట్టుదల పరంధామయ్యగారికి ఎక్కువయింది. జిల్లాబోర్డు ప్రెసిడెంటును అడిగితే లాభంలేదన్నాడు. ఊళ్ళో పెద్దలందరినీ సమావేశపరస్తే అయిదువందల రూపాయలకంటే ఎక్కువ చందాలు వసూలుకాలేదు. పరంధామయ్యగారు వెనుకముందులు చూడకుండా ఏడు వేల రూపాయలు ఖర్చుపెట్టి స్కూలుకు సొంతభవనం కట్టించాడు. పెద్దతోట వేశాడు. బళ్లో రాట్నాలూ, మగ్గాలు పెట్టించాడు. నేతపరిశ్రమలోని శిక్షణ పొందిన ఒక స్నేహితుని సహాయంతో బళ్లోనే ఖద్దరు నేయించేవాడు. చిన్న పిల్లలచేత చాపలు అల్లించేవాడు.

ఈ విధంగా స్కూలు దినదినాభివృద్ధి చెందడంతో పంతులు పరంధామయ్యగారి పేరు జిల్లా అంతటా మారుమోగిపోయింది. పైగా తన స్కూలులో ఎనిమిదవ తరగతి పాసయినవాళ్ళల్లో అనేకమందిని ఆయన సొంత ఖర్చుతో ట్రెయినింగుకు పంపించాడు.

## 2

ఒకనాడు పరంధామయ్యగారితో కలిసి పనిచేస్తున్న రామమూర్తి బడికి ఆలస్యంగా వచ్చాడు. వస్తూనే రామమూర్తి తన తరగతికి వెళ్ళకుండా పరంధామయ్యగారి గదికి వెళ్ళాడు. రామమూర్తి వాలకం చూచి ఆయనేదో ఇబ్బందిలో వున్నాడని పరంధామయ్య గ్రహించాడు.

“ఏం రామమూర్తిగారూ ఏమిటి విశేషాలు?” అన్నాడు పరంధామయ్యగారు.

“అబ్బే ఏం లేదండీ...”

# ★ నైవేద్యం ★

"రోజూ ఇంటిదగ్గర అలస్యం అవుతున్నట్లున్నది."

"అవునండీ......కుర్రవాడికి నాలుగు రోజులనుంచీ జ్వరం. ఇవాళ అసలు కూడా లేవలేదు."

"డాక్టరు కెవరికైనా చూపించక పోయారా?"

"ఆఁ...శర్మగారు మందు ఇస్తున్నారు. టైఫాయిడ్ అన్నారు. మళ్లీ తీసుకువెళ్లాలి పోస్తుందేమో నన్నారు."

"మరి సెలవు పెట్టి వెళ్లకపోయారా? మన పాఠాలన్నీ వాళ్ళకోసమేగా."

"అవు ననుకోండి. సెలవు పెట్టి ఏం చేసేదీ? ధరిలో దమ్మిడీ లేదు."

అట్లాగా. ఆ మాట నాకు ఎందుకు చెప్ప లేదూ?"

"ఏం చెప్పమంటారూ? ఇప్పటికే మీకు చాలా బాకీవున్నాను."

"బాకీ మాట తరువాత చూసుకొందాం. మధ్యాహ్నం ఇంటికి రండి. చేతనయింది చేస్తాను. ఆతరువాత సంగతి తరువాతనే. ఇక వదండి. అవతల పిల్లలు గోల చేస్తూంటారు."

ఈ విధంగా వరంధామయ్యగారు చాలా మంది సంతుళ్ళకు సహాయం చేశారు. సంతుళ్లకు అనేమిటి? ఇతర స్వార్థం కూడా అయన సహాయం పొందారు. ఆయన ఆశయాలూ, ఆదర్శాలూ అంతటితో ఆగలేదు. వేదపండితులను పిలిపించి సభలు జరిపించి దుశ్శాలువలూ మాటపడ పొర్లూ ఇచ్చి సత్కరించేవారు. విద్యార్థులకు కనీసం మూడుపూటలయినా సమారాధనలు చేసేవాడు. కనీసం పదిహేనుమందిపాటు అయింట్లో యేనాడూ ఇరవై విస్తళ్లకు తక్కువ లేచేవికావు.

ఈ విధంగా గంటకు అరవైమైళ్ల వేగంతో వెళ్ళే ఎక్స్‌ప్రెస్ ప్రయాణంగా వరంధామయ్యగారి నలభైఅయిదేండ్ల జీవితం నడుస్తోంది.

అప్పటికి ఆయన బావమరది మూర్తి స్కూల్ ఫైనల్ పాసయినాడు. ఏదో గుమాస్తాగిరిలో చేరాడు. వరంధామయ్యగారు బావమరదికీ, పెద్దతమ్ముడికీ పెళ్లిళ్లు చేశారు. పెద్దతమ్ముడు అన్నగారి నుంచి విడిపోయి వేరేకాపురం పెట్టాడు. అది చూచి బావమరదికూడా విడిపోయినాడు.

వెళ్ళేవాళ్ళు ఊరికే వెళ్లలేదు. వరంధామయ్యగారి ప్రశాంతజీవితాన్ని కల్లోలపరిచి మరీ వెళ్లారు. గుడ్డిలో మెల్ల. వరంధామయ్యగారికి ఇద్దరే పిల్లలు. పెద్దవాడు సుబ్బారావ్ స్కూల్ ఫైనల్ చదువుతున్నాడు. రెండోవాడు చిన్నపిల్లవాడు.

బావమరిదికి వరంధామయ్యగారంటే గౌరవ భక్తులు లేవు గాని విద్వేషం కూడా లేదు. కనుక తన వదకర్రాలలో మిగిలిన ఆరు ఎకరాల భూమిని తన వంతు అప్పు నాలుగు వేల రూపాయలనూ తీసుకొని వేరె వెళ్లాడు. ఇక వరంధామయ్యగారి జీవితాన్ని కల్లోలపరిచింది ఆయన పెద్ద తమ్ముడు శర్మ. శర్మకు వరంధామయ్యగారు విద్యాదానా చెప్పించారు. భాగ్యవంతుల పిల్లను తెచ్చి పెద్దకట్నం ఇప్పించి పెళ్ళిచేశాడు. పెళ్ళయినప్పటినుంచీ శర్మ మామగారు ఆస్తి పంపిణీ చేసుకోమని శర్మను రాపాడాడు. పైగా శర్మ ఇల్లరికం వెళ్లాడు. భార్యపోరు పడలేకనైతేనేం, మామగారి మాట కాదనలేకనైతేనేం శర్మ ఆస్తి పంపిణీకోసం వరంధామయ్యగారిమీద దావా వేశాడు. శర్మ వచ్చి వరంధామయ్యగారిని ఆస్తి కావాలని అడిగితే ఏ క్షణాన్నయినా ఇచ్చేవాడు. ఆ సంగతి వరంధామయ్యగారిని ఎరిగున్నవాళ్లందరికీ తెలుసు. కాని, దావా వేశాడు. ఎందుకు వేశాడంటే ఒక చిదంబర రహస్యం ఉన్నది. వరంధామయ్యగారి మేనల్లుడు కృష్ణమూర్తి మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో ఎమ్. ఏ. పాసయి ఎవరికీ చెప్పకుండా లండన్ వెళ్లాడు. వెళ్ళి ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ చదువుతున్నాను పదివేల రూపాయలు అప్పుగా పంపించమని వరంధామయ్యగారికి వ్రాశాడు.

ముందు వెనుకలు చూడకుండా వరంధామయ్యగారు పది ఎకరాలు తాకట్టు పెట్టి పదివేల రూపాయలు మార్వాడీదగ్గర అప్పు తీసుకొచ్చి కృష్ణమూర్తికి పంపించాడు. కృష్ణమూర్తి చదువుపూర్తయి బొంబాయిలో ఉద్యోగంచేస్తూ చచ్చిపోయాడు. ఆ అప్పు వరంధామయ్యగారే తీర్చవలసివచ్చింది. అందుకు అయిదెకరాల పొలం అమ్మాడు. ఆ అప్పుతో తనకు సంబంధం లేదని శర్మ అంటాడు. ఆ మాట వరంధామయ్యగారి ఎదుట అనలేదు. కోర్టులో అయితే అది వేరే సంగతి. కనుకనే దావావేశాడు. ఇందులో విచారణ జరపవలసినంత పెద్ద విషయం ఏమున్నది కనుక?

మార్వాడీలకు పోయినంత ఆస్తిపోగా మిగిలిన ఆస్తిలో రెండువంతులు శర్మకూ ఒకవంతు రెండో తమ్ముడు రంగారావ్ కూ వని కోర్టు తీర్పు చెప్పింది. రెండవ తమ్ముడి వాటాకింద వరంధామయ్యగారుంటున్న ఇల్లు వచ్చింది. ఎందుకు పనికిరాని మెట్ట ఒక ఎకరంకూడా వచ్చింది.

ఇటువంటి కష్టకాలంలో రెండవ తమ్ముడు రంగారావ్ ఇంట్లో చెప్పాపెట్టకుండా లేచిపోయినాడు. ఈ ఆఖరు రోజులలో చేతికి వస్తాడని అతనిమీద వరంధామయ్యగారు పెట్టుకొన్న ఆశలు నిరాశలే అయాయి.

## 3

కొండలలో పుట్టినది కొండలవాలులో విపరీతమైన వేగంతో ప్రవహించి మైదానంలో మందగమనం సాగించి మడుగు నిలచి దొర్లుకొన్నట్లు వరంధామయ్యగారు తన జీవిత ఘట్టలను సింహావలోకనం చేస్తున్నాడు. సింహావలోకనం చేస్తూ వరండాలో అటూ యిటూ పచారు చేస్తున్నాడు......

తన జీవితం ఎంత వేగంగా తెలియకుండా గడిచిపోయిందీ? ఇదంతా తాను ఎందుకు చేసినట్లూ? ఏమి ఆశించి ఇంతగా తాను ప్రయాసపడ్డట్లూ? ఎవరిని సంతోష పెట్టగలిగాడూ? రెండుచేతులతోనూ డబ్బు సంపాదించి ఇల్లాలినీ కుటుంబాన్నీ సంతోష పెట్టగలిగాడా? తమ్ముళ్లకు తను చేయగలిగిందంతా చేశాడా? పెద్దతమ్ముడికి విద్యాదానా చదువు చెప్పించి ఉద్యోగం చూపించి పెళ్ళిచేశాడు. పెళ్ళిచేసిన తరువాత......

ఆ శివరాత్రి నాటి సాయంకాలం ఆ విధంగా ఆ వరండాలో అటూ ఇటూ పచారు చేస్తూ ఆలోచిస్తున్న వరంధామయ్యగారికి జీవితంలో మొట్టమొదటిసారి కళ్ళు చెమ్మగిలినవి...ఆయన భార్య పార్వతమ్మగారు వరండాలో పచారుచేస్తున్న భర్తను చూచింది. ఇన్నేళ్లుగా చూస్తున్న వరంధామయ్య కాదనిపించిందామెకు. ఆ క్షణంలో అంతగా ఆయన కళ్లు ఎందుకు ఎర్రబడ్డయ్? ఎప్పుడూ గంభీరంగావుండే ఆ ముఖం ఎందుకంత కందగడ్డ అయిందీ?

"ఏమండీ.....సాయంకాలమయింది. స్నానం చేస్తారా? గుడికి వెళతారా?" అన్నది భర్తను చూచి. భర్తను చూస్తే ఆమెకు మామూలుగానే భయం. భయమంటే ఆయన కొడతాడనీ, తిడతాడనీ కాదు. ఆయన స్వభావమే అంత. నిత్యాగ్నిహోత్రుడు. కర్మిష్ఠి. ఎప్పుడూ యేదో పని చేస్తూంటే తప్ప తోచని వరంధామయ్యగారిని చూస్తే పార్వతమ్మగారికే కాదు ఇరుగుపొరుగువాళ్లకు కూడా కొంచెం భయమే.

"స్నానమా!...ఎందుకూ! సరేకాని పిల్లలేరీ?" అన్నాడు వరంధామయ్య. ఆ

అనటం మామూలుగా లేదు. దేశాంతరం పోయి ఇంటికి తిరిగివచ్చిన భర్త మొట్ట మొదటిసారి భార్యతో మాట్లాడేటప్పుడు కనిపించే ఆప్యాయత, అనురాగం ఆయన మాటలలో తొణికిసలాడినయ్.

పిల్లలేరీ అని ఆయన అడిగాడు. ఆ అడగడం పార్వతమ్మకు ఆశ్చర్యం కలిగించింది. ఆ పిల్లలు అనేవాళ్ళు ఇంట్లో ఉన్నారనీ, వాళ్ళ మంచి చెడ్డల బాధ్యత తనపై ఉన్నదనీ భర్తకు ఈనాడు తెలిసిందా అనిపించింది పార్వతమ్మకు. అట్లా అని పరంధామయ్యగారు పిల్లల చదువు సంగతి కాని, మంచి చెడుల సంగతి గాని ఏమీ పట్టించుకోనే పట్టించుకోలేదని చెప్పడానికి వీలులేదు. సొంత కొడుకులను కూడా ఆయన బడిపిల్లలలాగానే చూశాడు. బళ్ళో పిల్లల చదువు సంధ్యల విషయంలో ఎంత శ్రద్ధ చూపించాడో ఇంట్లో తన పిల్లల చదువు సంధ్యాల విషయంలో కూడా అంతే శ్రద్ధ చూపించాడు. వాళ్ళకు ఏం కావాలన్నా రెండో తమ్ముడు రంగారావు ద్వారా ఆ పార్వతమ్మ పరంధామయ్యగారి అడిగించేది. పరంధామయ్యగారికి రెండో తమ్ముడంటే వాత్సల్యం కనుక రంగారావు చెప్పగానే పిల్లలకు కావలసినవన్నీ తెచ్చేవాడు. ఇట్లాంటి పరంధామయ్య ఈ వేళ—ఈ శివరాత్రినాటి సాయం సమయాన పిల్లలేరీ అని ఎందుకు అడిగాడని పార్వతమ్మగారు ఆలోచిస్తూండగా రెండో కొడుకు వచ్చి అమ్మా అన్నం పెట్టవే అన్నాడు.

పరంధామయ్యగారు వాడిదగ్గరికి వెళ్ళి ఎత్తుకున్నాడు. నెలలపిల్లవాడినే ముద్దుగా ఎత్తుకోవడానికి తీరికలేని పరంధామయ్యగారు పన్నెండేళ్ల రెండో కొడుకును ఎత్తుకోవడం పార్వతమ్మకు ఆశ్చర్యం కలిగించదా మరి! వాడు బిత్తరపోయినాడు.

"మాడు బాబూ అన్నయ్య యేడీ?" అన్నాడు పరంధామయ్య.

"కోమటి కోటయ్య కొట్టుకు వెళ్ళాడు" అన్నాడు వాడు భయపడుతూ.

"ఎందుకు?" అన్నాడు పరంధామయ్య.

"అమ్మ పంపించింది"

"అట్లాగా...నువ్వు వెళ్ళి పిలుచుకురా" అన్నాడు పరంధామయ్య వాణ్ణి దింపుతూ. పెద్దపులి పంజాలోనుంచి ఎట్లాగో తప్పించుకోగలిగిన మేకపిల్లలాగా వాడు పరుగు తీశాడు. మళ్ళీ పరంధామయ్యగారు అటూయిటూ పచారు ప్రారంభించాడు. పార్వతమ్మ వంటింట్లోకి వెళ్ళింది. తెగిపోయిన ఆలోచనలకు అతుకు దొరికింది.

"అవును మరి. పెద్దతమ్ముడు మాత్రం ఏం చేస్తాడు? ఆస్తి అంతా అయిపోతున్నదని కనిపెట్టి వాటా పంచుకున్నాడు. వాడికీ పిల్లలున్నారాయె. ఆస్తి అంతా తన దర్జాకింద, తన ఆదర్శాల సేవాటిని అమలు జరపడంకింద, వంశగౌరవం అనేదానికింద బలి అయిపోతే వాడూ వాడి పిల్లలూ ఏం కావాలి? అదీకాక, తన తండ్రికి తానొక్కడే కొడుకు కాదుగదా? తను నిలిపినట్లు వాడు మాత్రం వంశగౌరవం నిలపవద్దా? నిలపాలి. నిలపాలంటే, వాళ్ల ఆదర్శాలనూ, ఆశయాలనూ వాళ్ళు అమలుజరపాలంటే కొంత ఆస్తి కావాలి. కేవలం ఉద్యోగం చేసి సంపాదించే డబ్బు చాలకపోవచ్చు. కనుక వాడికి ఆస్తి కావాలి. కావాలి కనుకనే దావా వేశాడు. మిగిలిన ఆస్తి అంతా వాడికే సంక్రమించింది. ఇందులో వాడి తప్పేమిటి? వాడి తప్పు కాకపోతే తనదా తప్పు? తనేం చేశాడూ? తను కాఫీ తాగడు. వక్కపలుకు వేసుకోడు. సిగరెట్ తాగడు. ఆస్తి అయిపోయింది! ఎట్లా అయిపోయింది?..."

అంతలో 'అమ్మా' అంటూ పెద్దకొడుకు వచ్చాడు.

వంటఇంట్లో పనులు చేసుకొంటున్న పార్వతమ్మ వచ్చేలోగా పరంధామయ్యగారు కలిపించుకొని "ఏం బాబూ ఎక్కడికి వెళ్ళావ్"? అన్నాడు.

పరంధామయ్యగారు కొడుకును ఈ ప్రశ్న ఎన్నడూ అడగనే లేదనిపించింది. కొడుకు ఎక్కడికి వెళుతున్నాడో తెలుసుకోవలసిన పరిస్థితి పరంధామయ్యగారికి ఇంతవరకు కలుగలేదు. అంతే కాదు. తెలుసుకొనే తీరికకూడా ఆయనకు లేకపోయింది. అందుచేత పెద్దకొడుకు తండ్రి వంక కాకుండా ఇంటి కప్పుకింద గోడకు వియూలగా చూస్తూ "రామమూర్తిగారింటికి వెళ్ళాను" అన్నాడు.

"కోమటి కోటయ్యదగ్గరికి వెళ్లావని తమ్ముడు చెప్పాడే" అన్నాడు పరంధామయ్య.

తండ్రికి నిజం తెలిసిందనే కారణంగా కొడుక్కి కలగవలసిన భయంకంటే ఆ క్షణంలో వాడికి అవమానమే కలిగింది. ఎందుచేతనంటే వాడింతవరకు ఈ అబద్ధం చెప్పలేదు. కోమటి కోటయ్యను వతిమాలుకొని వస్తువులు అప్పుగా తీసుకు రమ్మని తల్లి చెప్పింది. నాన్న అడిగితే నిజం చెప్పవద్దన్నది. చెపితే అప్పుచేసే కంటే పస్తులుండటం మంచిదని పరంధామయ్యగారు ఆగ్రహిస్తాడు. ఏమి చెప్పడమా అని వాడు ఆలోచిస్తూండగా పార్వతమ్మగారు వచ్చి వాడికి ఆబాధ తొలిగించింది.

"ఏమిటి అడుగుతున్నారు? నేనే పంపించా కోమటింటికి. తెల్లవారితే పొయిలో పిల్లిలేచే వీలు కనిపించడం లేదు. అందులోను ఇవాళ శివరాత్రి. ఇవాళ్ళ మంచినీళ్లుకూడా తాగకుండా ఉపవాసం వున్నారు. రెండు మానికల బియ్యం పవాశేరు నెయ్యి అప్పుగా తెమ్మన్నాను" అన్నది.

"అట్లాగా. ఇంట్లో ఏమీలేవని నాకు చెప్పకపోయావ్" అన్నాడు పరంధామయ్య. కాని, ఆ అనడంలో కోపం లేదు. అభిమానం లేదు. అభిమానంవల్ల కలిగే బాధలేదు.

ఆనందభవన్ (అలహాబాద్)

ఫొటో: సి. సీతారాం (మద్రాసు)

# ★ నైవేద్యం ★

పరంధామయ్యగారు స్వయంగా కోమటింటికి వెళ్ళి ఇంట్లోకి కావలసినవి తెచ్చి ఇరవైయేండ్లు అవుతుంది. ఇంట్లో ఎప్పుడూ త్రిపేటు చదువుకునే పిల్లలో ఉద్యోగాలు దొరకనిపంతులో, ఉద్యోగా లూడిన పంతుళ్లో, నౌకరులో వుంచేవాళ్లు. వాళ్లే ఇంట్లోకి కావలసిన వస్తు తెచ్చేవాళ్లు. కోమటి కోటయ్యనెప్పుడు కబురుచేస్తే అప్పుడు పరంధామయ్యగారు డబ్బు పంపించేవాడు.

ఆ నిశీధ వేళ పరంధామయ్యగారు కోటయ్య కొట్టుకు నడుస్తున్నాడు. ఆశ్చర్యం. కొట్టుకు నడుస్తూండగా ఆయనకు ఈనాడు కోటయ్య పూర్వ జీవితం లీలగా కనిపించింది. ఈ కోటయ్య వర్తకంలో నకోడీలు అమ్ముకొంటూ ఇరవయ్యేండ్ల క్రిందట ఈ ఊరు వచ్చాడు. రోజంతా కష్టపడినా రూపాయ దొరకడం దుర్లభమయిన ఆ రోజులలో కోటయ్యంటే తనకు చాలా గౌరవం ఏర్పడింది. ఆ గౌరవాన్ని పురస్కరించుకునే తను కోటయ్యకు పెట్టుబడి పెట్టాడు. ఆ పెట్టుబడి ఎంతో అందులో కోటయ్య తనకు ఎంత తిరిగి ఇచ్చాడో ఈనాడు పరంధామయ్యకు గుర్తులేదు. వీటన్నింటికీ ఏమి వచ్చెగాని కోమటి కోటయ్య ఎంత మంచివాడు! ఎంత కష్టపడి పనిచేసి ఈనాడు ఇంత వ్యాపారం చెయ్యగలుగుతున్నాడు! నౌకరు చేత తను కబురుచేస్తే ఇంట్లోకి కావలసినవన్నీ పంపించేవాడు. కోటయ్య కొట్లో ధరలు ఎక్కువని పార్వతమ్మ గొణుగు పెడుతుంది. ఏం ఎక్కువ ధరలు తీసుకోంటే? తీసుకోకపోతే కోటయ్య ఇంత వ్యాపారం ఎలా చెయ్యగలుగుతాడు అనుకొంటూ పరంధామయ్యగారు కోటయ్య కొట్టు దగ్గరికి వెళ్లాడు. కొంచెం దూరాన పంతులు పరంధామయ్యగారిని చూడగానే కొట్టుమీదనున్న కోటయ్య గబగబా బయటికి వచ్చి "పంతులుగారా రండి రండి. దండాలు" అన్నాడు.

"కోటయ్యా కులాసాగా వున్నావా!"

"ఏదో బాబూ మీ దయవల్ల అట్లాట్లా వున్నాను."

"ఇంకా బాదయేనంటావా?" అన్నాడు పరంధామయ్యగారు కోటయ్యను పరకాయించి చూస్తూ.

"అవును. బాబూ. మీదయే. ఆనాడు మీరు రెండువేల రూపాయలు ఇచ్చి దీపారాధన చెయ్యమన్నారు. మీ చేతి చలవ వల్ల నిలబడ్డాను. ఇప్పుడు మళ్ళీ మీరే నన్ను నిలబెట్టాలి."

"అదేమిటి? కోటయ్యా అట్లా అంటున్నావ్. ఇప్పుడు నీకు నేనేం చేసిపెట్టాలి.?"

"వేరే ఏమీ చెయ్యనక్కరలేదు బాబూ...పాత ఖాతాను మొత్తం 15 వందలదాకా నిలబడిఉన్నది. దయయుంచి రెండుమూడు రోజులలో సర్దుబాటుచేస్తే..."

పరంధామయ్య కాళ్లు వణికినయ్. కోటయ్యకు తాను 15 వందల రూపాయలు బాకీ వున్నాడా? ఇంత బాకీవుంటే యిన్ని రోజులూ ఎందుకు ఊరుకున్నాడు? మంచితనంవల్లనా? అయితే మాత్రం? తమ్ముడు దావా వేసి ఆస్తిఅంతా తీసుకుంటున్నాడన్న సంగతి కోటయ్యకు తెలియదా? తెలిస్తే ఎందుకు ఊరుకొన్నాడూ? ఏమో

ఆ దావా తరువాతనే కాను, ఇంత బాకీ తేలా తేనో?

“అట్లాగే కోటయ్యగారు నాలుగైదు రోజులలో సర్దుబాటు చేస్తాను.” అని ఎట్లాగో అనగలిగాడు పరంధామయ్య.

## 4

పంతులు పరంధామయ్యగారు తాతల నాటి ఇల్లు కూడా అమ్మివేశారన్న సంగతి తెలిసినప్పుడు వూరువూరంతా అనేక రకాలుగా వ్యాఖ్యానించింది.

అవును మరి. ఎంత పెద్ద ఆస్తి అయితే మాత్రం అంత జమీందారీ ఫాయిదా పోతే యేమవుతుందని కొందరన్నారు. ఎంత మంచివాడయితే మాత్రం అప్పు ఇచ్చిన వారిని తిరిగి అడక్కపోతే యేమవుతుందని కొందరు పెద్దలు తీర్పు చెప్పారు.

అవధానులుగారి—అంటే పరంధామయ్యగారి తండ్రి పేరు నిలబెట్టాడన్న కొందరు ముసలివాళ్లు కూడా ఆ గ్రామంలో లేకపోలేదు. లోకమంతా యేవిధంగా అనుకొంటున్నా, తన కనుసైగలలో మెలిగిన పంతుళ్లే యీనాడు తన తప్పులు పట్టడానికి సాహసిస్తున్నా పరంధామయ్యగారు ఉద్యోగం మానలేదు. అయితే ఆయన జీవితంలో వచ్చిన పెద్ద మార్పేమిటంటే ఇదివరకు వూళ్లో పనులన్నీ ఎంతగా నెత్తిమీద వేసుకునేవాడో అంతగా యీనాడు ప్రపంచ వ్యవహారాలను నిర్లిప్తంగా చూస్తున్నాడు. ఒకనాడు ఎంతనిష్ఠగా దేవతార్చన చేసేవాడో? అంత నిష్ఠగా సొంత పిల్లల చదువూ, మంచిచెడుల విషయాలలో కృషి చేస్తున్నాడు.

ఇల్లు అమ్మగా ఆ రోజులలో నాలుగువేల రూపాయలు వచ్చినయ్. కోటయ్య బాకీ పదిహేను వందలూ పోను మిగతా డబ్బులో వెయ్యి రూపాయలు పెట్టి రెండు వందల గజాల స్థలంలో పూరి పాక వేసుకున్నాడు. ఇంటి చుట్టూ సమంగా తోట పెంచుతున్నాడు. ఒకప్పుడు పరంధామయ్యగారిని చూచినవాళ్లు ఆయనను ఇప్పుడు గుర్తుపట్టలేరు. పెద్దపిల్లవాడికి టైప్ రైటింగూ షార్టుహాండూ చెప్పిస్తున్నాడు. రెండో పిల్లవాడి చదువు విషయంలో ఆయన చేసిన కృషి రాణించలేదు.

విచిత్రమేమిటంటే ఆయన జీవితంలో యిన్ని మార్పులు వచ్చినా, పెద్దతమ్ముడొక్కడూ కూడా ఆయనను చూడడానికి రాలేదు. తండ్రి పసితనంలోనే పోగా మంచి చెడులన్నీ నెత్తిమీద వేసుకొని చదువు సంధ్యలు చెప్పించి పెద్దవాణ్ణి చేసినా బావమరది అయినా ఆయనను పరామర్శించలేదు. అవును మరి? ఎందుకు ఓదార్చాలి?! వాళ్ళ ఆశని మంచినీళ్ళ ప్రాయంగా పరంధామయ్యగారు తన కీర్తి ప్రతిష్ఠలకోసం వాడుకొన్నారు.

వాళ్లందరి సంగతి అటుంచండి. పూర్వం ఆయనవల్ల సహాయంపొందిన పంతుళ్ళు గాని, మాష్టరంటే మాష్టరు పరంధామయ్యగారేనని ఇన్‌స్పెక్షనుకు వచ్చినప్పుడల్లా భజనచేసిన అధికారులు కాని ఆయనమీద సానుభూతి చూపించలేదు. ముప్పై ముసలి వాడవయ్యావ్. నీ వొంట్లో శక్తి లేదు. ఇక ఉద్యోగం నుంచి తప్పుకోమని జిల్లాబోర్డు శాసించింది.

అయినా పరంధామయ్యగారు బాధపడలేదు. బాధపడ్డట్లు కనిపించలేదు. ఇదంతా యిలా జరుగుతుందని ఇదివరకే తనకు తెలుసునన్నట్లుగా ఆయన నిర్వికారంగానే రోజులు నెట్టుకొస్తున్నాడు.

అటువంటి రోజులలో పరంధామయ్యగారి భార్య పార్వతమ్మ కలరావల్ల మరణించింది. ఊళ్లో కలరా వ్యాపిస్తున్నదని తెలిసి పరంధామయ్యగారు పేటపేటకు ఇంటింటికీ వెళ్ళి హోమియో మందులు పంచిపెట్టాడు. కలరా రాకుండా పడవలసిన జాగ్రతలను పిన్నపెద్ద అందరికీ వివరించాడు. కాని, సొంత భార్యను కాపాడుకోలేకపోయాడు.

కలరావల్ల ఇంట్లో మనిషి మరణించడం వల్ల పరంధామయ్యగారిని పరామర్శించడానికిగాని, అఖరికి పార్వతమ్మగారి శవాన్ని శ్మశానానికి తీసుకువెళ్లే విషయంలో సహాయపడటానికిగాని వూళ్లోవాళ్లు ఎవరూ రాలేదు.

చుట్టాలు అంతకన్నా రాలేదు. తండ్రి కొడుకులు ముగ్గురూ ఎట్లాగో తంటాలుపడి ఆ శవాన్ని శ్మశానానికి చేరవేసి దహన సంస్కారాలు అయినవంటే అయినవనిపించారు. ఆ పదిపదిహేను రోజులు గడిచినయ్. పరంధామయ్యగారే పిల్లలకు స్వయంగా అన్నం వండి పెడుతున్నాడు. పార్వతమ్మగారి మరణం పరంధామయ్యగారి దినచర్యలలోగాని, బాహ్యప్రవర్తనలోగాని మార్పు తీసుకురాలేదు.

ఆయనకు ఒకటే ఒక దిగులు రంగారావ్ ఏనాటికయినా తిరిగి రాకతప్పదు. వచ్చి నా ఆస్తి ఏంచేశావని అడిగితే యేం చెప్పాలి? తనకేం?? ఊరు పొమ్మంటున్నది. కాడు రమ్మంటూన్నది. తన ఇద్దరు పిల్లలుకూడా యేదో ఒక విధంగా బతక్కపోరు. కాని, రంగారావ్‌దే తనకు పెద్ద దిగులు. వాడు నెలల పిల్లవాడుగా వుండగానే తల్లి చనిపోగా తానే తల్లిగా వాణ్ణి పోషించాడు. చదువు చెప్పించాడు. పెద్ద పెద్ద కట్నాలతో పిల్లను ఇస్తామని ఎందరు వచ్చినా నాకు పెళ్ళివద్దంటే వద్దని రంగారావ్ ఎదురుతిరిగాడు. తన మాటకు ఎన్నడూ ఎదురుచెప్పని రంగారావ్ పెళ్ళి విషయంలో ఎదురుతిరిగాడు. పాపం వాడికి తనంటే ఎంతఇష్టం? ఎంతగౌరవం?



రావిచెట్టులో తాటిచెట్టు

ఫొటో: పెద్ది వెంకట్రాజు (కాకినాడ)

## ★ నైవేద్యం ★

వాడికి కూడా పెళ్ళిచేస్తే ఒక ఇంటివా డయివుండేవాడు. వాడికి రావలసింది వాడు కూడా తీసుకొనివుంటే తన బరువు తగ్గివుండేది. ఇదే విషయం రంగారావ్‌కు తాను ఎన్నోసార్లు చెప్పాడు. కాని తనమాట వాడు పెడచెవిని పెట్టాడు. పైగా నా యిష్టం, నాకు ఈ ఆస్తిలో దమ్మిడీవద్దు. అమ్మను నేను ఎరగను. అమ్మవయినా, అవ్వవయినా నువ్వే. నువ్వేమాత్రం అసి అనవసరంగా తగలపెట్టావ్ కనుకనా? కాని, రోజులొచ్చినయ్. అంతా కొట్టుకు పోయింది. మిగిలిందేమో మిగిలింది. అదంతా నీదే నీ ఇష్టం. నువ్వు ఏంచేసుకొన్నా సరేనని వాదించాడు. అంత ప్రేమగల తమ్ముడి వాటాలోని ఇల్లు తాను అమ్మాడు. ఎందుకు అమ్మాడూ? పిల్లలకు చదువు చెప్పించడానికా? ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యడానికా? వీటిలో వేటికయినా తాను ఈ అన్యాయం చేసివుంటే పరంధామయ్యగారి ఆత్మ ఇంతగా బాధపడి వుండేదికాదు.

వంశగౌరవంకోసం-అంటే తాను ఫలాని వారి కొడుకునన్న కీర్తి నిలబెట్టుకోవడానికి తాతలనాటి ఇల్లూ అమ్మాడు. నిజంగా దేవుడనేవాడు ఉంటే తానుచేసిన ఈపనిని క్షమిస్తాడా? ఈ దిగులుతోనే పరంధామయ్యగారు కూడా మంచమెక్కాడు. ఇప్పుడు ఆ యింట్లో అన్నీ ఆయన పెద్ద కొడుకే చూడవలసి వచ్చింది.

ఆచారులుగారు వచ్చి చెయ్యిచూసి అట్టే యేమిలేదు రెండురోజులు లంఖణంచేస్తే అదే తగ్గిపోతుందని యేదో నాలుగుమాత్రలు ఇచ్చాడు. రెండు రోజులు కాదుగదా రెండు పదులు ఇరవై రోజులయినా జ్వరం తగ్గకపోగా సంధి పుట్టుకొచ్చింది. ఆయనతో కలిసి పనిచేసిన పంతుళ్లూ, ఆయన సహాయం పొందిన పంతుళ్లూ వచ్చి చూచి పోతున్నారు. పిల్లలను ఓదార్చుతున్నారు. అంతేగాని, ఒక్కళ్ళుకూడా వాళ్లను ఆదుకోలేదు. అటువంటి రోజులలో రంగారావ్ తిరిగి వచ్చాడు. వస్తూనే పరంధామయ్యగారి మంచంమీద పడి పసిపిల్లవాడిలా గోలపెట్టాడు. కాని, వాడి యేడుపు పరంధామయ్యగారికి వినిపించనిదే! ఆయన కలవరిస్తున్నాడు.

"రంగా...రంగా.... పాపాత్ముణ్ణి.... మోసగాణ్ణి...క్షమించవూ......" అన్నాడొకసారి.

"అవునే. నేను చేసిందంతా తప్పే. కాని, ఆ మాట నువ్వు ఇప్పుడు చెప్తే యేం లాభం? నాన్న అంటే ఈ వూళ్లో ఎంత గౌరవం వుండేది? ఆ గౌరవం నిలబెట్టడానికే నేను ఇదంతా చేశాను......" అన్నాడు మరోసారి. మరోసారి బిగ్గరగా నవ్వి...."దేవుడు. దేవుడికి నైవేద్యం. శివుడికి హారతిచ్చి, నైవేద్యం పెట్టాను. నా ఆస్తి, తమ్ముళ్ళ ఆస్తి, బావమరిది ఆస్తిలో కొంత అందుకే అయిపోయింది...ఓహో.. స్వర్గం...మీ అందరికీ స్వర్గం సిద్ధం..."

రంగారావ్ అన్నగారి జబ్బు చూచి ఆందోళనపడ్డాడు. బస్తీకి వెళ్ళి పెద్ద డాక్టరును తీసుకువచ్చాడు. ఎప్పటికప్పుడు డాక్టరు దగ్గరికివెళ్ళి మందు తీసుకురావడానికి ఒకమనిషిని పెట్టాడు.

పిల్లలను చూచి ఏడ్చాడు. పార్వతమ్మ పోయిందన్న సంగతి తెలుసుకొని పెద్ద పిల్లవాణ్ణిచూచి రంగారావ్ ఒకరోజు ఇలా అన్నాడు:

"బాబూ...అమ్మవంటి మనిషిని ప్రపంచంలో ఎక్కడా చూడం. ఎన్నికష్టాలు పడ్డదో నేనిప్పుడు చెప్పలేను. నాన్న ఆ



## బందరులో టైమ్ సిగ్నల్

ఫొటో: ఎస్. మోహన్‌దాస్ (చిలకలపూడి)

చిడను ఇబ్బంది పెట్టారని అనను. కాని, ఆమె జీవితమే అటువంటిది. అర్ధరాత్రీ అపరాత్రి ఎంతమంది వచ్చిపడ్డా మారు మాట్లాడకుండా వండిపెట్టేది. ఆ వండడం మామూలు వంట కాదు. ఆచారాలు కావాలి. అవన్నీ అలావుంచు. నాన్న చేతిలో ఆస్తి అంతా అయిపోతున్నదని ఆమెకు తెలుసు. తన పిల్లలకు అన్యాయం జరుగుతున్నదని ఆమెకు తెలుసు. అయినా నాకు తెలిసినంత వరకూ యేనాడూ ఆమె అన్నయ్య మాటకు ఎదురుతిరగలేదు. ఇటువంటి మా అమ్మ మనందరికీ నిజంగా పూజ్యురాలు బాబూ."

రంగారావ్ చేయగలిగినంతా చేసినా [illegible]

యలలో పరంధామయ్యగారికి కొంచెం స్పృహ వచ్చింది. తమ్ముణ్ణి గుర్తుపట్టి "రంగా...రంగా...వచ్చావా....క్షమించవూ..." అన్నాడు.

"అన్నా......" అంటూ రంగారావ్ అన్నగారిమీద పడిపోయాడు.

అంతలో పరంధామయ్యగారు పిల్లలను పిలిచి ఇలా అన్నాడు:

"అయిపోయింది బాబూ......అయిపోయింది. బాబాయి చెప్పినట్లు నడుచుకోండి. లోకాన్ని మెప్పిద్దామని ఏమీ చెయ్యకండి. ఇతరులను మెప్పించే పనులు చెయ్యకం - చేస్తా మనుకొంటూ ఆత్మ వంచన చేసుకోవడం సులభం. నిజానికి...

రులకు ఏమీ...చె...య్య......లేవు." అంతే...

పంతులు పరంధామయ్యగారి ప్రాణం...టో పోయింది.

కాని, విచిత్ర మేమిటంటే పరంధామయ్యగారి పెద్దకొడుకు మాత్రం తండ్రి మాటలను విస్మరించకుండా ఏదో లక్ష్యం సాధించదలిచిన సాధకునిలాగా జీవిత పోరాటం సాగిస్తున్నాడే గాని, తండ్రి తనను అన్యాయం చేశాడని చింతించడం లేదు. ఇక రంగారావ్ సంగతి చెప్పనే అవసరం లేదు. మిగిలిన ఆ పూరిల్లూ, ఎకరం పొలం పిల్లలిద్దరికీ రాసిచ్చాడు. దియా... [illegible] లో ఏదో ఉద్యోగం చేస్తున్నాడు.




# విదేశాలలో విడాకులు

విడాకులు అమలులో ఉన్న దేశాలన్నిటిలోనూ విడాకులనేవాన్ని సిద్ధాంతంగా ఆమోదించారేగాని, ఆచరణలో విడాకులు పొందటం సులువుగాదు. విడాకులకి సదుపాయాలు కల్పించిన నరవేజా, రష్యా, అమెరికా మొదలైన దేశాలలో విడాకులనేది ఒక 'లైసెన్సు' కాదు. కొన్ని విపరీతపు పరిస్థితుల్లోనే అందుకు అవకాశం ఇవ్వబడింది. ప్రతి ఆయిదో సంసారం విడాకులతో విచ్ఛిన్నమౌతున్న అమెరికాలో కూడా పరస్పర అంగీకారంతో విడాకులు పుచ్చుకోవటం చట్టరీత్యా ఆమోదించబడలేదు. వ్యభిచారం, క్రూరత్వం, భార్య భర్తనిగాని భర్త భార్యనిగాని వదిలివేయటం – ముఖ్యంగా ఈ మూడు కారణాలపైనే అమెరికాలో విడాకులు డిక్రీ చెయ్యబడుతున్నాయి. కనుక అమెరికాలో కూడా విడాకులు పొందటం చట్టరీత్యా అంత సులభం కాదు. కాని ఆచరణలో విడాకుల సంఖ్య పెరగటమూ, వివాహమయిన మూడేళ్లలోపునే దంపతులు విడాకులు పుచ్చుకోటమూ, వారిలో సగానికి పైగా తిరిగి వివాహం చేసుకోటమూ అగుపడుతోంది. దీన్నిబట్టి విడాకుల సంఖ్య పెరగటమూ తగ్గటమూ కూడా విడాకుల చట్టంలోవుండే సదుపాయాలమీద గాక, ఆర్థిక, సాంఘిక పరిస్థితులమీదనూ, ప్రజల నైతికజీవనముమీదనూ ఆధారపడివుంటుందని ఋజువు అవుతున్నది.

అమెరికాలోనే కాక యూరపులో కూడా విడాకులు పుచ్చుకునేవారి సంఖ్య ఎక్కువ. కాని పునర్వివాహం చేసుకునేవారి సంఖ్య తక్కువ. 1857 వ సం॥లో ప్రప్రథమంగా బ్రిటనులో విడాకుల చట్టం అమలులోకి వచ్చింది. వ్యభిచారమూ, క్రూరత్వమూ, భార్యాభర్తలు ఒకరినొకరు వదిలివేయటమూ బ్రిటనులో విడాకుల చట్టంలోని ముఖ్యసూత్రాలు. విడాకులు పుచ్చుకోటమనేది ధనవ్యయంతో కూడుకున్నదైనప్పటికీ, విడాకుల అర్జీలకు ఎటువంటి లోటూ వుండేదికాదు.

ఇక చైనాలో విడాకులు అమలులోకి వచ్చినప్పుడు ఆ అవకాశాన్ని వినియోగించుకోటానికి ఎగబ్రాకినది స్త్రీలే ఎక్కువని తెలుస్తోంది. అయితే అది మొదటి రోజుల్లోమాత్రమే. తరవాత విడాకుల సంఖ్య బాగా తగ్గిపోయిందిట. చైనాలో ప్రజాప్రభుత్వం వచ్చినతరువాత అన్ని రంగాలలోనూ స్త్రీలకు లభించిన సమాన హక్కులతోబాటు విడాకులహక్కు కూడా వచ్చింది. (విప్లవానికి పూర్వం విడాకులు కోరే హక్కు స్త్రీలకు లేదు) విడాకుల విషయంలో దంపతులకి ఇప్పుడు సంపూర్ణ స్వాతంత్ర్య మిచ్చారు. బహు భార్యాత్వాన్ని నిషేధించారు. విడాకుల అనంతరం కూడా పిల్లల సంరక్షణాభారంలో తల్లిదండ్రులకు సమాన బాధ్యతున్నదని నిర్ణయించారు. నవచైనాలో స్త్రీలకి ఆర్థిక రాజకీయ రంగాలలో సమాన స్వాతంత్ర్యం వుంది. విడాకుల అనంతరం స్త్రీలు తిరిగి వివాహం చేసుకోవచ్చు. విడాకులకి యిన్ని సదుపాయాలు కల్పించబడినా నవచైనాలో విడాకుల సంఖ్య ఇప్పుడు బహు స్వల్పమే. దీనినిబట్టి విడాకుల సమస్య దేశంలోని ఆర్థిక రాజకీయ, సాంఘిక పరిస్థితులపై ఆధారపడి వుంటుందనే నిర్ణయించవలసి వస్తుంది. అంతేగాని కొత్తగా ఏదో అవినీతి ప్రబలుతుందనుకోవటం పొరబాటు.

విడాకులకి అవకాశం వున్నంత మాత్రాన దాంపత్య జీవితాలు యిప్పటికన్నా సుఖప్రదంగా వుండగలవనే వాదనలోని సత్యం కొద్ది సూక్ష్మంగా ఆలోచిస్తేగాని తె

### కౌముది
### ఉషారాణి

పనికపోవచ్చు. అయిష్టంతో కాపురం చేసే నిర్బంధం లేదు కనుక, దంపతుల జీవితాలు యిష్టానురాగాలమీదే ఆధారపడి వుంటాయి గనుక, దంపతులమధ్య పరస్పర అనురాగం గౌరవం అభివృద్ధిపొందటానికి అవకాశం వుంటుంది. విడాకులనేది దుష్ప్రవర్తనకి ఒక శిక్షగా ఎంచుకోవచ్చు కనుక, భార్యాభర్తలు పరస్పరం హింసించుకోవటం, కష్టపెట్టుకోవటం తగ్గవచ్చు. ఇంతేగాక, వివాహానికి పూర్వమే సరైన జీవిత భాగస్థులని ఎన్నుకోకపోతే జీవితం దుర్భరమై విడాకులు పుచ్చుకోవలసిన అగత్యం కలుగుతుందనే యోచన ముందుగానే కలిగి, జాగ్రత్తపడటానికి అవకాశం వుంటుంది. ఇక వివాహావిషయంలో పొరబాటే జరిగి

# ★ విదేశాలలో విడాకులు ★

నట్టయితే, ఆ పొరపాటుని సరిదిద్దుకునే సదుపాయం కల్పించటం న్యాయమే గాక, పూర్తి స్వాతంత్ర్యానికి సంబంధించిన సామాన్య సూత్రమేనని అంగీకరించాలి.

దాంపత్యజీవితమనేది యిద్దరు వ్యక్తుల మనస్తత్వం, ఉద్రేకాలపై ఆధారపడి ఉంటుంది. ఒక పురుషుడు గానీ స్త్రీ గానీ విడాకులు తలపెడితే అది ఒక సాంఘిక దురాచారమని అసహ్యించుకోక, అటువంటి విషాదసంఘటనకి దారితీసే కారణాలు ఏమయ్యుంటాయో ఆలోచిస్తే బాగుంటుంది. దాంపత్య జీవితాలు సాఫీగా నడవనప్పుడు అటువంటి విషాదసంఘటనలకి "విడాకులు" పరిష్కారమార్గమని పాశ్చాత్య దేశాలలో ఎంచబడింది.

'విడాకులకి ఇవి కారణాలు అయుండవచ్చు, ఈ సందర్భాలలో విడాకులు ఇవ్వవచ్చు' అని చట్టరీత్యా ఒక నిర్ణయానికి వచ్చినప్పటికీ, నిజానికి దాంపత్య జీవితాలు సాగకపోవటమే దానికి ముఖ్యకారణం. "క్రూరత్వం" అనే పదాన్నే తీసుకుందాం. దాదాపు అన్ని దేశాలలో భార్యాభర్తలు విడిపోవటానికి యిది ఒక కారణమన్నారు. భార్యాభర్తలు ఒకరిపై ఒకరు క్రూరంగా ప్రవర్తించారనే విషయం తీర్పుసమక్షంలో నిరూపించటం కష్టం. క్రూరత్వమనేది ప్రత్యక్షంగా చావబాదటమైనా అవచ్చు, పైకి ఏ ఉద్రేకమూ కనబరచకుండా మానసికంగా హింస పెట్టటమూ కావచ్చు. ఇటువంటి కారణాలని న్యాయస్థానాల్లో ఋజువు చేయలేనప్పుడు దొంగసాక్ష్యాలకి అవసరం కలుగుతుంది. న్యాయస్థానంతృప్తిచెందనిపక్షంలో విడాకులు యివ్వకపోతే ఆ దంపతుల పరిస్థితి మరీ ఘోరంగా పరిణమిస్తుంది.

ఈ ఆధునికయుగంలో మన సామాజిక ఆర్థికపరిస్థితులూ, దాంపత్య జీవితవిధానమూ విడాకులకి ఆవశ్యకత కల్పిస్తున్నాయి. మారిపోయే కాలంతోబాటు మన అభిప్రాయాలని మార్చుకోకుండా మనువునీ, ధర్మశాస్త్రాలనీ వల్లిస్తూ విడాకులని ఆమోదించకపోడమంటే కాలాని కెదురీదినట్లే. ఒకవేళ ప్రజలు విడాకుల చట్టాన్ని దుర్వినియోగం చేసుకుని తుచ్ఛమైన, అతి హేయమైన జీవితాలకు అలవడితే, ఆ దోషం విడాకుల సూత్రానిది మటుకు ఎన్నటికీ కాదు; మన సమాజంలో చెలరేగుతున్న యితర దురాచారాలు, పరిస్థితులే ఆ దోషానికి కారణం అవుతాయి.

విడాకులకి ఆవశ్యకత ఈనాడు కొత్తగా కలగలేదు. విడాకులకి దారితీసే పరిస్థితులు ఏనాడూ సంభవిస్తూనే వున్నాయి. మన పూర్వీకులలో కొందరు విడాకులని చట్టరీత్యా ఆమోదించారనే విషయం, క్షణక్షణం హైందవ సాంప్రదాయమంటూ గగ్గోలు పెట్టే కొందరు జ్ఞప్తికి తెచ్చుకుంటె బాగుంటుంది. అనాదినుంచీ స్త్రీలకి ఘోరమైన అన్యాయ అక్రమాలు జరుగుతున్నా యనుకోవటం పొరబాటే. మౌర్యులు పరిపాలించే కాలంలోనే స్త్రీల పునర్వివాహం ఆమోదించారు. బౌద్ధ మతస్థులలో పరస్పర అంగీకారంతో విడాకులు పుచ్చుకునే అవకాశం వుండేది. స్త్రీలు కొన్ని సందర్భాలలో భర్తని వదిలేసి పునర్వివాహం చేసుకోవటానికి వశిష్ఠ మహాముని అనుమతించాడు. కౌటిల్యుని అర్థశాస్త్రంలో పురుషులకంటె స్త్రీలకే పునర్వివాహం చేసుకునే సదుపాయాలు ఎక్కువని వ్రాయబడింది. పరస్పర శత్రుత్వంవల్ల హానికలిగే ప్రమాదాన్ని నివారించే ఏర్పాటు అప్పట్లో వుండేదనే విషయం ఈనాడు మనకి ఆశ్చర్యాన్ని కలిగించవచ్చు. భర్త సన్యాసం పుచ్చుకున్నా, పరారీ అయినా, సంఘంలో అవమానింపబడినా స్త్రీలు విడిపోయేందుకు పూర్వం కూడా వీలుండేది.

మన దేశంలో క్రైస్తవులకీ, పార్శీలకీ,

ముహమ్మదీయులకీ విడాకులకి ప్రత్యేక చట్టాలున్నాయి. శూద్రులలోనూ, మలవారలోనూ విడాకుల ఆచారం వుండనే ఉంది. ముహమ్మదీయులు భార్యలను యిష్టానుసారం వదిలివేయవచ్చు; కాని స్త్రీలు పునర్వివాహం చేసుకోవటానికి భర్త అంగీకారమో లేక న్యాయస్థుల నిర్ణయమో అవసరమన్నారు. హిందూ స్త్రీలు భర్తనుండి విడిపోవటానికి, అన్యమత స్వీకారమూ, క్రూరత్వం, తీవ్రమైన వ్యాధిగ్రస్థత మొదలైన పరిస్థితులు తగిన కారణాలుగా ఎంచేవారు. కానీ ఆచరణలో ఇవేమీ ఫలించలేదు. సనాతన హిందూ సాంప్రదాయన్నీ ఆచారాలనీ పూజ్యభావంతో చూచే హిందువులు వీటిని ఆదరించలేదు.

ఇవేవలి హిందూ సాంప్రదాయం ప్రకారం స్త్రీకి ఒక పవిత్రమైన ఉన్నత స్థానం ఉంచన్నారు. భర్త ఎటువంటివాడైనా అతనితో కాపురం చేయాలనీ, సహనం స్త్రీలకి ఉన్నగుణాలలో ఉత్తమలక్షణమనీ, అది ప్రదర్శించే స్త్రీ ఒక దేవతాస్వరూపిణి అని బోధించారు. వివాహాలు స్వర్గంలో నిర్ణయింపబడతాయనే నమ్మకం కలిగివుండేవారు. భార్యవల్ల ఆడపిల్లలు మాత్రమే కలిగినా లేక, పుట్టిన పిల్లలంతా మరణించినా, భార్య తగవులమారి అయినా భర్త ఆమెని స్వేచ్ఛగా వదిలివేయవచ్చునన్నారు. కాని భార్య ఏ పరిస్థితులలో గాని విడాకులు పుచ్చుకుని, పునర్వివాహం చేసుకోవటానికి నీతిశాస్త్రాలు అభ్యంతరాలని ప్రచారం చేశారు. హిందూ స్త్రీలు పునర్వివాహాన్ని కోరరనే వాదనని కూడా బయలుదేరతీశారు. స్త్రీల శీలము మీదా పత్నీవ్రతము మీదా ప్రత్యేక శ్రద్ధ చూపిస్తూ, స్త్రీలు పురుషులతో ఏనాటికీ సరితూగరనే మూఢనమ్మకాన్ని ధర్మసూత్రాలకింద ప్రచారం చేశారు. హిందువులలో నేటికికూడా ప్రబలుతున్న ఇటువంటి సాంప్రదాయసిద్ధమైన అభిప్రాయాలే విడాకుల హక్కుకి అడ్డంకిగా తయారవుతున్నాయి. పూర్వం ఆచరించిన ఆచారాలనీ, వాటిని సృష్టించిన ధర్మకర్తలనీ, వారు స్త్రీలని అణగద్రొక్కి హీనపరచటానికి సంకల్పించారని విమర్శించటం పొరబాటు. ఆనాటి ప్రజల జీవనవిధానం, సాంఘిక పరిస్థితులూ, రాజకీయ వాతావరణమూ, అటువంటి ధర్మసూత్రాలకి ఆవశ్యకతను కల్పించాయి. విదేశీయుల దండయాత్రలకిలోనైన హిందువులు తమ స్త్రీలను సంరక్షించుకోటానికే ఆ సాంప్రదాయాలని సృష్టించుకున్నారు. ఆ సాంప్రదాయాలే, ఆ విశ్వాసాలే ఇప్పుడు కూడా మన జీవితాల్ని తీర్చిదిద్దగలవనుకోడం పొరబాటు. కాలానుగుణంగా శాసనాలూ ఆచారాలే కాదు, విశ్వాసాలు కూడా మారాలి. ★

# 'స్త్రీలు-ఉద్యోగాలు':

చింతలపూడినుంచి శ్రీమతి మండా అచ్చమాంబగారు యిలా వ్రాస్తున్నారు—

"చిన్నతనమున తండ్రి, యవ్వనమున భర్త, ముసలితనమున మాతృభావమువలన కుమారుడును స్త్రీకి రక్షకులగుచున్నారు. అందువలన స్త్రీకి స్వాతంత్ర్యము లేదు' అని మన పూర్వస్మృతికారుడు 'యథార్థస్థితిని' మాత్రము చెప్పినాడు. ఆయన స్త్రీలపట్ల ద్వేషము కనపరచినాడనుకొందమన్నచో, చివరి వాక్యమేకదా మనకు ప్రమాణము! నేడుగూడ ఏ స్త్రీగాని (స్వతంత్రుల మనుకొనుచున్నవారు) ఇట్టి రక్షణవిధి లేకనున్నానని హృదయముపై చేయివేసుకొని చెప్పగలదా? నేటి యధికారులచే 'సమ్మెటపోటుల'కు లోనైన యీ యుద్యోగములలోని కష్టసుఖములు, నైరాశ్యములు లక్షలాది పురుషు లనుభవించుట చాలక; యుగయుగములనుండి అతి పవిత్రముగ మర్యాదగ గౌరవపూర్వకముగ చూడబడుచు, స్వేచ్ఛగ సర్వాభీష్టప్రదముగ గృహారాజ్య పరిపాలన మొనర్చు స్త్రీలను గూడ పాలుజేయుట యెమంత శ్రేయస్కరము?"

—మన స్మృతికారులు వారి కాలంలో ఆనాటి సాంఘిక పరిస్థితులనీ, జీవన విధానాన్నీ పురస్కరించుకుని పురుషులు స్త్రీలకు రక్షకులగుచున్నారని అన్నారు. ఆ విషయం ద్వేషంతో అనలేదు. కాని ఎల్లప్పుడూ అదే యథార్థస్థితి అనుకో నక్కరలేదు. సమాజంలో స్త్రీపురుషు లిద్దరికీ పరస్పర సంరక్షణ తప్పదు. అటువంటిది నేడు స్త్రీలు సమాన స్వాతంత్ర్యాన్ని కోరగానే ఏదో అస్వాభావికమైన, అసహజమైన జీవితాన్ని వరిస్తున్నారనుకోవటం పొరబాటు. నేడు అందరికీ సమాన రక్షణ, అవకాశాలు కల్పించే బాధ్యత ప్రభుత్వంపైనా సమాజంపైనా ఉంది. అందువల్ల స్మృతికారుడు వర్ణించిన రక్షణవిధి ఇప్పుడంత అవసరము లేదనే విషయం అందరూ గ్రహిస్తున్నారు. ఉద్యోగాలనగానే అధికారులచే సమ్మెట పోటులతో కూడుకున్నవనుకోవటం పొరబాటు. ఎవరో కొందరు అధికారుల్ని బట్టి ప్రభుత్వోద్యోగాలనీ ఇతర సంస్థలలో ఉద్యోగాలనీ నిరసించకూడదు. ఏవైనా లోపాలుంటే వాటిని సరిదిద్దడానికి ప్రయత్నించాలేగాని ఉద్యోగాలే మానుకోవాలనడం హేతువాదం కాదు. సమ్మెట

## ★ స్త్రీలు - ఉద్యోగాలు ★

పోటులకు భయపడి ఇళ్ళలో మగ్గిపోవడం ఏమంత మంచిపని? ఈ స్త్రీలందరూ యుగయుగాలుగా పవిత్రంగా స్వేచ్ఛగా, గౌరవంగా బ్రతుకుతున్నారంటే నమ్మటం కష్టం. మర్యాద, గౌరవం, స్వేచ్ఛ, పవిత్రత అనేవి పురుషులకుగానీ, స్త్రీలకుగానీ 'ఉద్యోగాల'వల్ల మార్పు చెందవు.

కర్నూలునుంచి శ్రీ 'చంద్ర' గారు యిలా వ్రాస్తున్నారు.

"మైనారిటీ తీరని మన సంస్కారం అనే వ్యాసంలో సంస్కారం అనే మాటకు అర్థం లక్ష్మీదేవిగారుగానీ, ఉషారాణిగారుగానీ తెలియజేశారు కాదు. స్త్రీలు ఉద్యోగాలు చేయాలనేవాదన బయలుదేరటానికి కారణం ఏమిటనే విషయం ఎవరూ లోతుగా ఆలోచించడము లేదు. ఇప్పుడున్న యిబ్బందులూ అడ్డంకులూ పూర్వం లేవా అని నా ప్రశ్న? ఇప్పుడీ ఆందోళన పెరగటానికి సరైన కారణాలు పలువురూహించలేక పోతున్నారు. మన దేశంయొక్క నైతిక విలువ సన్నగిల్లిపోవటానికి కారణం పాశ్చాత్య నాగరికతాప్రభావమే నని ఘంటాపథంగా చెప్పగలను. కట్నాల సమస్య ఎలా బయలుదేరిందీ ఆలోచించుదాం. పురుషుడు తన నైతిక విలువని కోల్పోయి దానిని కప్పిపుచ్చటానికి కట్నాలపేచీ తల పెట్టబడింది. కట్నాల కీలకం అంతా పూర్తిగా పురుషులవల్లనే వచ్చిందనటానికి సందేహంలేదు."

—సంస్కారం అనేది ఒక సాంకేతిక పదం కాదు, నిర్వచించి చెప్పటానికి. పదిమంది వుంటే ఒక కుటుంబములో ఒక్కొక్కరు ఒక్కొరకమైన సంస్కారాన్ని అలవరచు



గోరంటాకు సింగారం
ఫొటో: ఎస్. రామకృష్ణ, (మాయవరం)

కుంటారు. లక్ష్మీదేవిగారూ నేనూ వ్యక్తిగతసంస్కారాన్ని గురించి చర్చించలేదు – అది సామాజిక సంస్కారాన్ని గురించే. ఆర్థికదుస్థితిలో నలిగిపోతున్న మధ్యతరగతి కుటుంబాల సంఖ్య మనదేశంలో పెరుగుతున్న కారణమే స్త్రీలు ఉద్యోగాలు చెయ్యకూడదా అనే వాదనని బయలుదేరతీస్తోంది. ఇంతేకాదు. 'నా సంపాదన, నా హోదా, నాభార్య, నా బిడ్డలు' అనేవి మాత్రమే ప్రధానంగా చెలామణీ అవుతున్న నేటి సామాజికవ్యవస్థలో, అనేకమంది స్త్రీలు నిరాధారంగానో పరులపంచలో అతిహీనస్థితిలోనో బ్రతకవలసి వస్తోంది. భర్త పోయినందువల్లగాని, భర్త విడిచిపెట్టిన కారణంవల్లగాని సమాజంలో పతనావస్థ సంభవించకుండా బిడ్డలను పోషించి వృద్ధిలోకి తీసుకురావలసిన బాధ్యతను అనేకమంది స్త్రీలు భరించవలసి వస్తోంది. ఇటువంటి పరిస్థితులకి స్త్రీలు సిద్ధపడవలసిన అవసరం కలుగుతోంది. ఇంక ఇందులో "లోతుగా" ఆలోచించటానికి వేరే విమా లేదు. ఇప్పుడున్న కొన్ని యిబ్బందులు పూర్వమున్నమాట నిజమే. కానీ కొన్ని యిబ్బందులు తొలగిపోతున్నాయని ప్రస్తుతం ఉద్యోగం చేస్తున్న స్త్రీలే బుజావు చేస్తున్నారు. మన దేశంయొక్క నైతిక సంస్కృతి పన్నగిల్లుతుందనే భయమే కలిగినట్లయితే, ఆదోషాన్ని పాశ్చాత్యనాగరికతా ప్రభావానికి మాత్రమే అంటకట్టకుండా, కారణాలు ఏమయ్యుంటాయో "లోతుగా" ఆలోచిస్తే బాగుంటుంది. కట్నాల కీలకం పురుషులు తమ నైతికవిలువని కప్పిపుచ్చటానికి లేవదీశారనటం హాస్యాస్పదంగా వుంది. చాలకాలంనుంచీ వస్తున్న ఈ ఆచారానికి మూలకారణం వియ్యంపొందేవారు సమానఘాయాలోనివారైఉండాలనే భావం. అది నేటికి ఈరీతిగా పరిణమించింది. ఇప్పుడు కట్నాలులేని వివాహాలు మర్యాదకి లోపం అనే అపోహ మగపిల్లల తల్లిదండ్రులకే కాదు ఆడపిల్లల తల్లిదండ్రులకూడా వుంది. ఇటువంటి కృత్రిమాచారాలు నశించడానికి స్త్రీలు పురుషులతోపాటు సమానహోదా పొందాలి.

భీమవరంనుండి శ్రీమతి కె. రాధగారు యిలా వ్రాస్తున్నారు:

**ఉద్యోగములుచేస్తే పెండ్లిండ్లవడము కష్టమని కొందరి ఉద్దేశము. ముఖ్యముగ స్త్రీలకు ఉద్యోగములన్నవి కొంతెము చదువుకుని పైకి చదవటానికి ఆర్థికశక్తిలేక కట్నాలిచ్చుకోలేనిమధ్యతరగతిలో అవివాహితలైన యువతులకు అవసరమని నా ఉద్దేశము."**

—ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలని, వారు ఉద్యోగాలు చెయ్యటం యిష్టపడే యువకులే వివాహం చేసుకుంటారు. వివాహసమస్యని పరిష్కరించటానికోసమే ఏ స్త్రీగానీ ఉద్యోగము చెయ్యాలని సంకల్పించదు. అవసరమనేది పరిస్థితులనిబట్టి కలుగుతుంది. అది అవివాహితులకే ఎక్కువ అనుకోవటం తప్పు.

కుదరవల్లినుంచి శ్రీ రాముంగారు యిలా వ్రాస్తున్నారు:

**"డబ్బుగలవాళ్ళకే ఉద్యోగాలు దొరకటం జరుగుతోంది. మరి అలాటప్పుడు నిరుద్యోగసమస్య ఎలా తీరుతుంది? మధ్యతరగతి ఆడ, మగవాళ్లకు ఉద్యోగాలు ఎక్కడనుంచి వస్తాయి?"**

—డబ్బుగలవాళ్ళకి రికమెండేషన్లు ఉద్యోగాలు సులభంగా దొరికే మాట నిజమే. కాని మధ్యతరగతివారు చేసే ఉద్యోగాలకి ధనవంతులు ఎలాగూ సిద్ధపడరు. అందరూ చెయ్యగలిగేటన్ని ఉద్యోగాలు లేకపోవటానికీ, ప్రస్తుత నిరుద్యోగ సమస్యకీ కారణం ధనవంతులూ కారు; స్త్రీలూ కారు. స్త్రీలందరూ ఉద్యోగాలు మానేస్తే నిరుద్యోగం పోతుందా? నిరుద్యోగానికి మూలకారణం సమాజ ఆర్థికవిధానం.

# సమీక్ష

స్త్రీలూ - ఉద్యోగాలు అనే అంశం మీద పాఠకులు చాలమంది వారి అభిప్రాయాలనీ, విమర్శలనీ, సందేహాలని తెలుపుతూ లేఖలు పంపారు. అందరి లేఖలనూ ప్రచురించడానికి గానీ, విమర్శించినవారందరికీ సమాధాన మివ్వడానికి గానీ వీలు లేకపోయినందుకు చింతిస్తున్నాను. అయితే సాధ్యమైనంతవరకూ లేఖలూ విమర్శలలోని అంశాలన్నిటినీ ప్రచురించడానికి ప్రయత్నించాం. ఈ సమస్యగురించి పాఠకులు చూపిన విమర్శనాదృష్టి, సహృదయత, ఉత్సాహాలకు నా కృతజ్ఞత.

స్త్రీలు - ఉద్యోగాలు అనగానే ఉద్యోగం పురుష లక్షణం గనుక స్త్రీలు

(34-వ పేజీ చూడండి)

1. త్రివేణీ సంగమం, ప్రయాగ.

2. అంతర్వాహిని 'సరస్వతి'

(కోటగోడ నానుకొనివున్న చూరుక్రింద ఒక బావివుంది. అందులో కన్పించే నీళ్ళే 'సరస్వతీ నదీ జలం అంటారు.)



ఫొటోలు: సి. సీతారాం, మద్రాసు.

వనితాలోకం సీరియల్



# స్వయంసిద్ధ



## 8

పూజామందిరం ప్రక్క పందిట్లో పెళ్ళివారి కందరికీ వీడ్కోలిస్తున్నారిక్కడ. అక్కడ వీధిలో అప్పుడే బ్రహ్మాండమైన ఊరేగింపుకు ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. రకరకాల వాయిద్యాలు, బాజా భజంత్రీలు, బళ్లు - అన్నీ ఇక బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నాయి. ఈ ప్రాంతాల్లో ఇంత పెద్ద ఊరేగింపు ఇదివరకెవరూ చూసి యెరుగరు. ఎక్కడా చడీ చప్పుడూ లేకుండా మొదట్లో మగపెళ్లివారు నిరాడంబరంగా పందిట్లోకి ప్రవేశించటం చూసి చాలామంది నిరుత్సాహపడ్డారు. అలాంటివారంతా, పెళ్ళివారు తిరిగి వెళ్లబోయేముందు ఇంత ఊరేగింపుకు యేర్పాట్లు చేసుకోవటం చూసి తెల్లబోయారు...

కనకాంజలినిచ్చి, వధువు బయటికి రాగానే హరినారాయణబాబు వియ్యంకుణ్ణి ఉద్దేశించి - "ప్రధానం చేసుకోటానికి వచ్చిన రోజునే మన అమ్మాయి నాకు వాగ్దానం చేసేసింది. తయారయిన విద్యామందిరం చూసి అమ్మాయి సంతోషించినప్పుడే నాకు సంతృప్తి - విముక్తి. కనుక ఇప్పుడే ఇక్కడున్న వారంతా - అక్కడికి దయచేసి తమ పాదధూళి అక్కడ పడేట్లు చేయాలి. ఈ ఊరేగింపుకు చాలా విశేషమైన ఏర్పాట్లుకూడా చేయించాం" అన్నాడు.

దీనికి మొదట్లో ఆడపెళ్ళివారు ఓ అభ్యంతరం లేవదీసినా అది ఆట్టేసేపు నిలవలేదు. "మేము మిమ్మల్నందర్నీ బలవంతంచేసి సరాసరి మా పాటలి గ్రామానికి తీసుకు వెళ్ళటంలేదు. మా అమ్మాయి కోరిన విద్యామందిరం ప్రారంభోత్సవం చూసిరావటానికి అభ్యంతరం ఏమిటి?" అన్నాడు హరినారాయణబాబు.

చివరికింక ఏ అభ్యంతరమూ నిలవలేదు. ఆడపెళ్ళివారి తరఫు మగవాళ్లు, ఆడవాళ్లూ అందరూ తమకు ఏర్పాటుచేసిన అందమైన బళ్లెక్కి బయలుదేరారు. చండి తల్లి ఒక్కతే మాత్రం ఇంట్లో ఉండిపోయింది. కూతురి చేతుల్లోంచి కనకాంజలిని స్వీకరించాక తల్లి మళ్ళీ వెనక్కి తిరిగిచూడకుండా లోపలికి వెళ్ళిపోవాలి. అది సంప్రదాయం. ఈ సంప్రదాయం తెలిసినవాడవటంవల్ల, వియ్యంకుడు తర్వాత ఆమెనేమీ బలవంతపెట్టలేదు.

ఇక్కడిలా బ్రహ్మాండంగా ఊరేగింపు బయలుదేరింది. అక్కడ విద్యాలయం దగ్గర ఊళ్ళో పెద్దలందరూ సమావేశమయారు. ఆ పల్లీయులకి నిజానికి పెళ్ళిమీదకన్న విద్యాలయంమీదనే ఆసక్తి హెచ్చు. ఒక్క పదిహేను రోజుల్లో ఈ ఊసర ప్రదేశంలో ఇంత పెద్ద భవనాన్ని నిర్మించడం ఈ జమీందారుకి ఎలా సాధ్యమయిందో! హరినారాయణ గంగూలీ అనుకున్నాటికి తన వాగ్దానం ఎలా చెల్లించుకోగలిగాడో! ఈ జమీందారు అసాధ్యమైన పనులన్నిటినీ అవలీలగా చేసిపారేస్తాడని ఇదివరకుదాకా కథలు చెప్పుకోవటంమాత్రమే విని ఉన్నారు ప్రజలు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూసి, తాము విన్నదానికి ఇప్పుడు చూస్తున్నదానికి నిజంగానే తేడా యేమీలేదు అని— ఆ ఊళ్ళోవాళ్ళే కాదు. చుట్టుపక్కల పది ఊళ్లలోవాళ్లుకూడా ఆశ్చర్యంగా చెప్పుకోటం మొదలెట్టారు. కనుకనే అందరూ ఈ ప్రారంభోత్సవ శుభదినంకోసం ఎదురు చూస్తున్నారు. ఈ సమావేశం జరిగేచోట నాలుగువైపులా - ఈ భవనం ఏ పద్ధతిలో కట్టినదీ ఎవరికీ ముందుగా తెలియకుండా - పరదాపట్లా కట్టించారు. దాంతో ప్రజలకి మరింత తహతహా జాస్తిఅయింది.

కొన్ని స్వదేశీ - విదేశీ వాద్యాలతో ఊరును మార్మోగింపచేస్తూ ఊరేగింపు విద్యాలయం ముందుకు రాగానే ఒక్కసారిగా కొన్ని ఫిరంగులు మ్రోగినట్లు ధ్వనులు వినిపించాయి. ఆ ధ్వనులు వినిపించటంతోపాటు ఆ భవనానికి చుట్టూ కట్టి ఉంచిన తెరలన్నీ - నాటకరంగంమీద తెర దానంతటది తొలిగినట్లు-ప్రక్కకు తొలిగిపోయాయి. ప్రతిభావంతులైన శిల్పులెందరో కలిసి శ్రద్ధగా అందంగా తయారుచేసిన ఆ విద్యామందిరం కుతూహలులై ఉన్న ప్రజల చూపుల్ని ఆకర్షించింది.

రెండు వారాల క్రితంవరకూ పశువులు పొర్లాడుతూ పాడుపడ్డట్లు ఉండేదీ ప్రదేశం. అక్కడిప్పుడో దివ్యభవనం కళ్ళకు మిరుమిట్లు గొల్పుతూంటే—కట్టుకథల్లోలాగా ఇదేదైనా గారడీ[illegible]ంగా నిర్మితమయిందేమో అని అనిపించసాగింది.

ఆ విద్యాలయం లోపలికి ప్రవేశించటానికి అంత వెడల్పునా విశాలమైన మెట్లున్నాయి. ఆ మెట్లకి రెండువైపులా రెండు పెద్దపెద్ద వరండాలున్నాయి. ఆ మెట్లకి ఎగువున ఆర్చీల కడ్డంగా 'వెల్వెట్ క్లాత్ కర్టెన్' వేసిఉంది. ఆ ఆర్చికి అటూ ఇటూ ఉండే సిమెంట్ స్తంభాలమీద 'శ్రీచండీ విద్యామందిరం' అని అక్షరాలు చెక్కి ఉన్నాయి.

ఊరేగింపు మండపందగ్గరికి రాగానే హరి

---

మూలం : మణిలాల్ వంద్యోపాధ్యాయ అనువాదం : మద్దిపట్ల సూరి

నారాయణబాబు ముందుకు వచ్చి – వధూవరులను, కొంతమంది వధువుతాలూకు ముఖ్య బంధువులను వెంట తీసుకుని మెట్లెక్కి ఆ 'వెల్వెట్ కర్టెన్' దగ్గిర కొచ్చి ఆగాడు. ప్రాంగణమంతా ప్రజలతో కిటకిటలాడిపోతోంది.

హరినారాయణబాబు వధువుకేసి చూసి నవ్వుతూ—నువ్వు చేత్తో స్పృశించందే ఈ పరదా తొలగదమ్మాయీ. ఆ పరదాని నువ్వే తొలిగించి నీ విద్యామందిరంలోకి ముందు నువ్వే ప్రవేశించాలి" అన్నాడు.

చండికి శరీరమంతా గగుర్పొడిచింది. పమిటకొంగు నడుముకు బిగించి, ఆ పెద్ద పెద్ద పరదాలను తొలగించసాగింది.

హరినారాయణబాబు నవ్వుతూ "మా తల్లి మమ్మల్ని తనవెంట తీసుకెళ్లేట్టులేదు. వెనకా ముందూ చూడకుండానే పరదాలు తప్పించేస్తోంది. భేష్! అదే కావలసింది. నువ్వు ఓసారి స్పృశిస్తే చాలుతల్లీ, ఇంక నువ్వు ఇవతలికి వచ్చెయ్" అన్నాడు.

నిముషంలో పర్దాలు ప్రక్కకి తొలగిపోగానే ఆ విద్యామందిరం ముందిరిహాలు అందరి చూపుల్నీ జిగేల్ మనిపించింది.

ఇలాంటి భవనాలు ఈ ప్రాంతాల్లో అసలు లేకపోలేదు. కాని ఇంత అందంగా ఇంత నవీనపద్ధతులలో ఉన్నదిమాత్రం ఇదే. హాలంతా పూలతో రణాలతో చిత్రపటాలతో చక్కగా అలంకరింపబడి ఉంది, దానికి మూడువైపులా మూడు పెద్దపెద్ద గదులున్నాయి. ప్రతి గదిలోనూ పాలిష్ చేయ్యబడ్డ చక్కని బల్లలు వరుసగా అమర్చి ఉన్నాయి. వాటికి ఎదురుగా ఉపాధ్యాయినులకు మేజాలూ కుర్చీలూ వేసి ఉన్నాయి. గోడకి ఒక బ్లాక్ బోర్డు, భారతదేశం మ్యాపూ ఉన్నాయి. వాల్లోకి ప్రవేశించగానే అటూ ఇటూ ఉన్న గదులు రెండూ మనోకవిపంగా అలంకరింపబడి ఉన్నాయి. ఒక గదిలో ఆఫీసుకి అవసరమైన సరంజామా, బీరువాలనిండా కాయితాలూ, పెన్సిళ్లూ, పలకలూ, విద్యాసాగర వాచకాలు, ఒకప్రక్కన రాట్నాలూ — ఏవులూ కావలసినన్ని ఉన్నాయి రెండో గదినిండా ఒట్టి బీరువాలు మాత్రమే ఉన్నాయి. వాటిల్లోకి పుస్తకాలు ఇంకా తెప్పించలేదు.

చండి ముందు లోపల ప్రవేశించగానే ఆమె వెనుక అందరూ హాల్లో ప్రవేశించారు. హరినారాయణబాబు మెల్లిగా చండిని అనుగమిస్తూ నీ యీ పాఠశాలకి చండీ విద్యామందిరం అని పేరుపెట్టించాను తెలుసా అమ్మా? ఎలా ఉంది పేరు? సరియైన పేరే పెట్టానుకదూ?" అని అడిగాడు.



"రూపందేహి, జయందేహి...."
ఫోటో: ఎన్. రామకృష్ణ (మాయవరం)

ఆ మాటవగానే చండిముఖంలో ఎంతో సంతృప్తి కన్పడింది. అతీసది గమనించి, "చూడు తల్లీ! లోకుల దృష్టికి నా నవు డెంత, దుర్బలుడుగానూ, తీసికట్టుగానూ కన్పించినా, అతడి పేరు నిర్మలమైనదీ, శక్తివంతమైనదీ అయిుడాలి. అలా అయితే భగవంతుణ్ణి ఉద్దేశించి ఆ వ్యక్తి చేసే ప్రార్థన ఎన్నడూ వ్యర్థంకాదు. ఆ భగవంతుడి ప్రేరణవల్లనే అవసరమైన వ్యక్తులు వరుగెత్తుకవచ్చి, అతడి పనులన్నీ నిర్వర్తించిపెట్టిపోతారు. నువ్వు స్వార్థంకోసమై భగవంతుని ప్రార్థించ లేదు. దేశదౌర్భాగ్యం తొలగిపోయే మార్గం ఏమిటా అని నీ కోమలహృదయం తల్లడిల్లిపోయి నువ్వు కంట తడిపెట్టుకుంటూంటే భగవంతుడు మాత్రం స్థిమితంగా కూర్చోగలడా తల్లీ! ఈ పాఠశాలాప్రతిష్ఠాపనకి గంభీరమైన మానసికపానమే హేతువు. నువ్వు నిజంగా 'స్వయంసిద్ధ'వి తల్లీ!" అన్నాడు.

 స్వయంసిద్ధ 

## 9

వివాహమై చండి అత్తవారింటికి వస్తూనే, అంతఃపురానికి సర్వాధికారిణి యైన రాణీ మాధురీదేవిమనస్సులో కలత కలిగించింది.

శోభనంనాటి రాత్రి అమాయకుడైన భర్త ముఖతః విన్న సంగతుల ననుసరించి, అత్తవారింట్లో తానెలా మెలగాలో ముందుగానే ఒక నిశ్చయానికి వచ్చేసింది. భగవంతుడు తనని ప్రతిద్వంద్వులతో యుద్ధం చెయ్యటానికే సృష్టించాడా అనిపించిందామెకి. శ్యామపురానికి వచ్చినప్పట్నుంచీ తానే యే అన్యాయాలకు అకృత్యాలకు అడ్డుపడిందో, వాటి కన్నిటికీ ప్రతిఫలంగా ఎన్నోరకాల నిందలని భరించాల్సి వచ్చింది. అయితే యేం, వాటిని ఏనాడూ లక్ష్యపెట్టలేదు. ఆనాటి రాత్రి భర్త చెప్పగా తాను విన్న గాథనుబట్టీ, ఎంతపెద్ద ఆపద, విప్లవం, ఎన్నిరకాల తగాదాలు కలిసికట్టుగా రానున్నాయో గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదామెకి. భర్తకి ఆ యింట్లో ఏమాత్రం గౌరవంలేదు, ఆదరణ అంతకన్నా లేదు. ప్రతిష్ఠ అనేది అసలే సున్న... తానా పేదయింటిపిల్ల - అలాంటి అమాయకుడికి సహధర్మచారిణిగా ఎలా మసలుకోవటం? తన ఆత్మగౌరవానికి భంగం కలగనిమాత్రం ఎవరు చెప్పగలరు? ఇవన్నీ బాగా ఆలోచించుకుని, ముందుగానే ఒక నిశ్చయాన్ని తీసుకుని ఈ బాకుతి జమీందారుల ప్రాసాదంలో అడుగుపెట్టింది చండి.

కాని ఆ యింట్లో మాధురీదేవిది మాటే పెద్ద ప్రతాపం! ఆమె మాటకి తిరుగులేదు. ఆ యింటి యజమాని—తన కుమారుడూ— నౌకర్లూ అయ్యా అని పిలిస్తేనే తృప్తిపడే రకం. అంతేకాని వారిచేత రాజాగారనీ, జమీందారని పిలిపించుకోవటం అతడికి ఇష్టం ఉండేదికాదు. కాని 'రాజా' అని పిలుదుగల జమీందారుమాతురైన మాధురీదేవి, భర్త అలా పిలిపించుకోకపోవటం అతడి ప్రతిష్ఠకు భంగం అన్నట్టు మధ్య మధ్య హెచ్చరిస్తూ ఉంటుంది. అతడి ఈ పొరపాటును తాను సర్దుబాటు చేస్తున్నట్టు వ్యవహరిస్తూ ఉంటుంది. తానీ యింట్లోకి వచ్చి ఈ సంసార నావ చుక్కానిని చేత పట్టిన రోజునే - పుట్టింటిదగ్గర తాను రాజకుమార్తెగానే ఉన్నానని, ఇక్కడికి వచ్చి రాణి అయినానని - ఆశ్రితుల్ని, నౌకర్లని అందర్నీ పిలిచి చెప్పింది. అంచేత భర్త మినహా అందరూ ఆమెని రాణీగారనే పిలుస్తుంటారు. తల్లిప్రతిష్ఠ కొడుక్కి దక్కింది. ఆమె ఆదేశంప్రకారం - ఆమె కొడుకు నివారణుని అందరూ యువ రాజాగారనే పిలుస్తూ ఉంటారు.

గోవిందుడి వివాహం రాణీకంత యిష్టం లేదు. అయినా ఆమె ఒకరకంగా మనస్సును సమాధానపరచుకుంది - పేదవాళ్ళ యింటి పిల్ల కనుక, ఇక్కడికి రాగానే ఈ ఐశ్వర్యం ఇదంతా చూసి నోరు నొక్కుకునే పడిఉంటుంది. అలాంటిదాన్ని తన దాసిగా, అమాట కొస్తే క్రీత దాసిగా చేసుకోవటంకూడా ఏమంత కష్టం కాదు. అంచేతనే మనస్సులోని మాలిన్యాన్ని బయటపెట్టుకోకుండా పైకి ఉత్సాహాన్ని వెలిబుచ్చింది. ఆనందాన్ని వ్యక్తపరిచింది. కాని అందులోకూడా దీర్ఘంగా నిట్టూరుస్తూ 'పిల్లవాడు వెర్రిబాగులవాడు కదా అని ఏదో పేదపిల్లని తెచ్చి కట్టాల్సి వచ్చింది. పైగా ఆ పిల్ల కొంచెం తలతిక్క ఉన్న పిల్లట కూడా. ఈ యింట్లో కలిసిపోతుందనే ఆశలేదు. వాడి కది చివరికి గుదిబండ అవుతుందేమో!' అని మధ్య మధ్య తన విచారాన్ని నటించేది. అంతఃపురంలో పరిచారికలదగ్గిర్నుంచి 'అందరూ అత్తాకోడళ్లు కలుసుకోగానే ఆ కోడలి అదృష్టం ఎలా పరిణమిస్తుందో అన్న భయంతో నిట్టూర్చసాగారు.

జంకూ గొంకూ అనేది లేక - ఎంతో ప్రతిభావంతురాలిగా కన్పించే చండి ముఖాన్ని తొలిసారిగా చూసినప్పుడే మాధురీదేవిమనస్సులో రవంత సంశయం బయలుదేరింది. క్రొత్తకోడలికి సహజంగా ఉండే అపరిమితమైన సిగ్గునీ బెరుకుతనాన్నీ దులిపేసుకుని చండి సింహద్వారందగ్గిర మేనా దిగింది. ద్వారంలో అడుగుపెట్టగానే వారి ఐశ్వర్యాన్ని సూచించే వస్తువులు అక్కడ చాలా విరజిమ్మి ఉన్నట్లు కన్పిస్తాయి. కాని ఈ పేదపిల్లదృష్టిని అవేమీ ఆకర్షించలేదన్న సంగతి రాణీ ఒకకంట కనిపెడుతూనే ఉంది. పైగా చండి ముఖం గాంభీర్యంతో గర్వంతో తొణుకుతున్నట్లుంది. మాధురీదేవి సంప్రదాయం ప్రకారం వధువుకి ఎర్రనీళ్లు దిగతుడుపుగానే చండి - ఆమెకి భక్తిశ్రద్ధలతో పాదాభివందనం చేసింది. అక్కడ చేరిన ముత్తైదువుల కందరికీ చేతులు జోడించి నమస్కరిస్తూ - ఆచారం ప్రకారం అక్కడ పరచిన ఆస్తరణలమీదనుంచి నిస్సంకోచంగా లోపలికి వెళ్ళసాగింది. మామూలు ప్రకారం అవరాయిస్తూ ఎవరూ ఆమెని లోపలికి నడిపించుకు వెళ్లవలసిన అవసరంరాలేదు. ఇతరులెవరూ గమనించలేదు కాని, ఇతరులెవ్వరూ కనిపెట్టకుండా-జడభరతుడిలాంటి భర్తను చండి తనతోపాటు చురుకుగా నడిపించి తీసుకెళ్ళటం మాధురీదేవి మాత్రం కనిపెట్టింది. ఆమె అప్పుడే విస్తుపోయింది. 'ప్రస్తుతం ఈ వంశానికి పెద్దకోడలిగా తనకుండే అధికారాలన్నిటినీ ముందుగానే ఆయత్తం చేసుకుని, వెనకటి పద్ధతులనన్నీ తుడిచేసి, మహిమాన్వితయైన మహారాణిలాగా వస్తున్నట్లుందే ఈ పిల్ల! తన రాజ్యాధికారాన్ని లాక్కోటానికా?' అనికూడా అనిపించిందామెకి. తానూ తొలిసారిగా ఈ యింట్లోకి ఇంత కన్న అహంకారంతో అడుగుపెట్టిన సంగతి రాణికి గుర్తొచ్చింది.

ఇంక మామూలుగా జరగవలసిన లాంఛనాల బాధ్యతంతా పరిజనుల కప్పగించి మాధురీదేవి తన గదిలోకిపోయి పడుకుంది. పరిచారికలు వెంటపడబోతే వారిని వెనక్కి పంపేసింది. తలగడాలో తలదూర్చి నిర్జీవురాలిలాగా చాలాసేపు పడుకుంది. తనకి తెలియకుండానే తన కన్నీళ్ళతో తలగడా అంతా తడిసిపోయేసరికి, కంగారుగా లేచి కూచుంది. పైటచెంగుతో కన్నీళ్లు తుడుచుకుని, "ఛీ, ఛీ. ఇదేమిటి? వేలెడంత ఉందో లేదో ఆపిల్లని ప్రతిద్వంద్విగా భావించి ఏడుస్తూ కూచోటం ఏమిటి నేను!" అనుకుంది మనస్సులో. బలవంతాన లేచివచ్చి బయట వరండాలో నుంచుంది. అక్కడ నుంచుంటే కన్పించే ఈ వివాహమహోత్సవంతాలూకు అలంకరణంతా ఆమె దృష్టికి పొగకమ్మినట్లు కన్పించసాగింది. ఆమెలో ఆమెకే ప్రశ్న ఉదయించింది. ఎవరిదీ తప్పు? ఇదేం ప్రతీకారం?

కాస్సేపు ఆ వరండాలో అటూ ఇటూ పచార్లుచేసి, మళ్ళీ ఒకచోటుకి వచ్చి నుంచుంది రాణి. "అసాధ్యమైన ప్రతిన పట్టానసా నాకే పరాజయం! నిజానికి వధువు నివారణుడి ప్రక్క నిలబడవలసింది కదూ ఇవాళ!" వెంటనే భర్త అన్న మాటలు అశరీరవాక్కుల్లా ఆమె చెవులకి సోకాయి: 'ఈ రాదారిపడవను లాక్కుపోగలదనే స్టీమర్లాంచికి జతపరచటం'.....రాణి హృదయం కళవళపడసాగింది! ఇంత వేగంగల ఈ స్టీమర్లాంచి సహాయంతో గంగూలీ వంశంలోని ఆ అమాయకపు గాడిద ఈ జమీందారి గద్దెనెక్కటానికి మెల్లిమెల్లిగా

ముందుకు పోతున్నట్లు ఆమె భావనాదృష్టికి కన్పించసాగింది. మాధురీదేవి కంపించి పోతూ అరచేతుల్లో ముఖం దాచుకుంది.

మరుక్షణంలోనే "అమ్మా! విన్నావా. క్రొత్తకోడలి పొగరుమోతుమాటలు!" అని నివారణు డొచ్చి అడగటం చెవినిపడింది.

తన మనస్సులోని వేదనను అణచుకుని ఆమె ఉలిక్కిపడి, కొడుకుకేసి తేరిపార చూసింది. కొడుకుముఖం ఇంత వెలవెల పోవటం ఆమె యెన్నడూ చూడలేదు.

ఆమెకి నోట మాట పెకిలిరాలేదు – కాని ఆమెచూపులు మాత్రం ప్రశ్నిస్తున్నట్లే ఉన్నాయి.

"ప్రధానం రోజున, నాన్నగారొక్క కొరడా ఆమెకి కానుకగా ఇస్తూ–దీంతో

## ★ స్వయంసిద్ధ ★

ఓ గాడిదను లొంగతీసుకోవాలి" అని చెప్పారుట! ఆ గాడిదను నేనేనని, నా కోసమే తాను చూస్తున్నానని అందరి ముందూ అనేసింది" అని నివారణుడు తల్లితో ఫిర్యాదు చేసుకున్నాడు.

మాధురీదేవి తన మనస్సులోని భావాన్ని బయటపడనీకుండా పైకి నవ్వుతూ "ఇవ్వాళ్టి రోజున అనే మాటలన్నీ పట్టించుకుంటావురా పిచ్చివాడా? నువ్వు మరిదివి కనుక వేళాకోళమాడి ఉంటుంది" అన్నది.

"నాకీ వేళాకోళాలూ అవీ తెలియవు. అది వొట్టి వేళాకోళం కాదసలు. ఎంత అహంకారంతో గర్వంతో అన్నదనుకున్నావ్? నేను ముందుగానే చెపుతున్నాను. ఆవిడకి గర్వభంగం చేయకపోతే నేను యువరాజునే కాను" అన్నాడు నివారణుడు కోపంతో.

మాధురీదేవి తెల్లబోయి స్థాణువులా అలాగే కూచుంది గుడ్లప్పగించి చూస్తూ. నివారణుణ్ణి వెనక్కి పిలిచి, అతణ్ణి సమాధానపరిచి పంపటానికి గొంతు పెకిలి మాట రానేలేదామెకి. ★

## ★ స్త్రీలు - ఉద్యోగాలు ★

(26-వ పేజీ తరువాయి)

ఆ మాటే తలపెట్టకూడదనీ, మాతృత్వం నశిస్తుందనీ, సంసారాలు విచ్ఛిన్నమైపోతాయనీ కొందరు భయం ప్రకటించారు. స్త్రీలకసలు పురుషులతో సమాన స్వాతంత్ర్యమవసరమా, మన హైందవ సాంప్రదాయంప్రకారం స్త్రీ స్థానం ఎటువంటిదీ, అనే విషయాలని కొందరు అతి ఓపిగ్గా చర్చించారు. మరికొందరు 'లేగు ఉద్యోగాలు చేసి సంపాయించిన డబ్బుతో కట్నాలసమస్య తీరేట్లయితే స్త్రీలు ఉద్యోగాలు చెయ్యటానికి అభ్యంతరం లేద'న్నారు. స్త్రీలుకూడా ఉద్యోగాలు చెయ్యడానికి వస్తే పురుషుల నిరుద్యోగ సమస్య విషమంగా పరిణమిస్తుందనే వాదనతో మటుకు దాదాపు అంతా ఏకీభవించారు.

స్త్రీలు ఉద్యోగాలు చెయ్యటంవల్ల ఉన్నత సంస్కారం అలవడే ఆస్కారముందనే విషయాన్నటుంచి, అనేక కుటుంబాల ఆర్థిక స్థితి చక్కబడే అవకాశముందని మటుకు ఒప్పుకుతీరాలి. ఇక శరీరపరిశ్రమకి పురుషులు ఓర్చినంత స్త్రీలు ఓర్చగలరా, పిల్లల సంరక్షణవిషయం ఏమవుతుంది అనే సమస్యలని వారికి లభించే సదుపాయాలని బట్టీ, ఆరోగ్యాన్ని బట్టీ నిర్ణయించవలసివుంటుంది. ఉద్యోగమంటే కేవలం ఆఫీసులకి వెళ్ళవలసినవే ననుకోవలసిన అవసరం లేదు. ఉన్నత విద్యకీ, డిగ్రీ కోర్సులకీ అవకాశం లభించనివారు, వారివారి అభిరుచులనుబట్టి చిత్రలేఖనం, సంగీతం మొదలైన వాటిలో శిక్షణపొంది ఒక 'కెరియర్' నిర్మించుకోవచ్చు. 'ఉద్యోగం' అనే పదాన్ని ఈవిధంగా అర్థం చేసుకుంటే స్త్రీలు పురుషులతో పోటీపడరనే విషయం బోధపడుతుంది.

స్త్రీలు ధనార్జనకి తలపెట్టటం పురుషుల మీద ఆధిక్యత చూపటానికి కాదు; పూర్తి ఆర్థికస్వాతంత్ర్యాన్ని అభిలషించి అంతకంటే కాదు. మన సమాజంలో నానాటికీ అడుగంటుతున్న ఆర్థికపరిస్థితులను సరిదిద్దుకునే అవసరమే స్త్రీలు ధనార్జనకి తలపెట్టడానికి ముఖ్య కారణం.

హైందవ సాంప్రదాయాలనీ, పూర్వ స్మృతులనీ వల్లిస్తూ స్త్రీలకి ఉద్యోగాలు అనవసరమనే వాదాన్ని ఈ ఇరవయ్యో శతాబ్దంలో—అందులో స్త్రీలకి పురుషులతో సమాన హక్కులు కావాలనే సమయంలో—లేవదీయటం సమంజసంగా లేదు. రోజు రోజుకీ మార్పు చెందుతున్న మన పరిస్థితుల్ని, అభిప్రాయాలనీ, అభిరుచులనీ అర్థం చేసుకుని వాటితోబాటు మనంకూడా మారటానికి ప్రయత్నించటం మంచిది. సదుపాయాలనేవి అవసరాన్ని బట్టి వాటంతటవే కలుగుతాయనే విషయం ప్రస్తుతం ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలు (వారిసంఖ్య తక్కువగా ఉన్నా సరే) నిరూపిస్తున్నారు. ఉద్యోగాలవల్ల స్త్రీల మనః ప్రవృత్తిలో ప్రత్యేకమైన మార్పేమీ రాదు. ఇలా అనుమానించటం స్త్రీలకే కాదు, పురుషులకు కూడా గౌరవప్రదం కాదు.

ఈ అంశంమీద చర్చ యింతటితో ముగిస్తూ యికముందుకూడా పాఠకులు ఇతర చర్చనీయాంశాల పైన వారి అభిప్రాయాలను ఉత్సాహంతో తెలుపుతారని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను. ★




# దేవుడి పెళ్ళి

సిద్ధాంతి మల్లికార్జునం

దేవుడి గుళ్లో పెళ్లంటా
చూచివత్తము రండర్రా
కన్నుల పండువు చక్కా చేసీ
పుణ్యము గట్టుక వత్తమురా ॥దే॥

చిన్నా పెద్దా పేదా సాదా
భేదాలంటూ లేనే లేని
పెద్దలందరూ చేసే పెళ్ళిని
చూచీ వత్తము రండర్రా ॥దే॥

మేళా లంటా తాళా లంటా
ధగధగ మెరిసే దీపాలంటా
పూలపందిరి భోగా లంటా
ఘుమఘుమ విరిసే వాసనలంటా॥దే॥

గుళ్ళో గంటలు మోగనురా
బాజాలన్నీ మోగనురా
ఢంకాలన్నీ మోగునురా
పెళ్ళికి సమయం వచ్చెనురా ॥దే॥

పరమేశ్వరుడే పెళ్ళికొడుకురా
పెళ్ళికూతురూ పార్వతిరా
తెలిసీ తెలియని సిగ్గులు ఒలికే
చిన్నదంపతుల చూతమురా ॥దే॥

బాలలుచేసే బొమ్మల పెళ్ళికి
తల్లీ దండ్రీ సంతోషిస్తే
భక్తులుచేసే దేవుడి పెళ్లిని
ముల్లోకాలూ మెచ్చెనురా ॥దే॥

చల్లనికాలం రావాలంటే
చక్కని బుద్ధులు కలగాలంటే
ఊరూ వాడా ఒకటై వచ్చి
దేవుడిపెళ్ళి చెయ్యాలోయ్. ॥దే॥



# రిహార్సల్ ముచ్చట

1. కృష్ణుడు: ప్లీడరుగారి అబ్బాయి.

2. సుందరం: డైరెక్టరుగారి కొడుకు.

3. వేణు: మాష్టారుగారి అబ్బాయి.

4. రాఘవుడు: గుమాస్తాగారి అబ్బాయి.

రంగము 1

(వీళ్లు శనివారం ఆదివారం ప్లీడరుగారి గదిలో సమావేశమౌతారు)

సుందరం: ఒరేయ్! ఈవేళ మన నాటకం రిహార్సలుందా? లేదా?

కృష్ణుడు: (బల్లలను, తండ్రి పుస్తకాలను చూపిస్తూ) ఉందిరా! రిహార్సలు ఇక్కడే వేద్దాం. చూశావా! మా గది ఎంత విశాలంగా ఉందో! ఇక్కడే మానాన్న చదువుకుంటాడు. ఇది మానాన్న బీరువా. ఎన్ని పుస్తకాలున్నాయో! ఇవన్నీ చదివేశాడు మానాన్న.

సుం: మహా గొప్పగా చెబుతున్నావు. అయితే మీ నాన్న సినిమా తీయగలడేమిటి? మా నాన్న ఫస్టుగా తీస్తాడు. మానాన్న చుట్టూ ఎప్పుడూ ఆడాళ్ళూ, మొగాళ్ళూ దణ్ణం పెడుతూ ఉంటారు తెలుసా! మా నాన్న కారుకూడా కొన్నాడు. హేఁ! (గొప్పగా, ఠీవిగా చూస్తాడు)

కృ: (ఉక్రోషంతో) అహా! చెప్పావు లేవోయ్! మానాన్న పెద్ద పెద్దకోర్టుల్లో బల్లగుద్ది మాట్లాడేస్తాడు. ఇంగ్లీషులో తడుముకోకుండా పెద్ద దొరగారిలా మాట్లాడుతాడు. ఒకమాటు ఏమైందో తెలుసా! నేను జీతండబ్బులు అడగడానికి మా నాన్నకోసం కోర్టుకి వెళ్లాను. అప్పుడేం చేస్తున్నాడో తెలుసా మా నాన్న - మిలార్డు అని ఒక్కఅరుపు అరిచాడు. దాంతో అక్కడున్న వాళ్లంతా గప్‌చిప్ అయిపోయి తెల్లబోయారు.

పోడూరి భోగరాజు

వేణు: పెద్ద గొప్పా యేమిటి? మానాన్న బెత్తంపుచ్చుకొని డస్కు మీద కొట్టాడంటే!.........పిల్లలు హడలిపోయి బల్లక్రిందకు దూరుతారు. పైగా మా నాన్నకు పేపర్లు దిద్దడానికి వస్తాయి. అప్పుడు చూడాలి. మానాన్న చుట్టూ ఎంత వాళ్ళైనా దణ్ణాలు పెడుతూ తిరుగుతారు.

రాఘవ: మానాన్న పనిచేసే ఆఫీసు ఎంత పెద్దదో! మీరు చూడలేదు అంచేత మీకు తెలియదు. అబ్బో - అక్కడ డవాలీ వేసుకొన్న బంట్రోతులు వాళ్లు - ఓ అది చెప్పడానికి వీల్లేదు. అది పెద్ద గవర్నమెంటువాళ్లు నడుపుతున్నారట. ఇక్కడవాళ్లు కాదు. ఢిల్లీ వాళ్లు. మానాన్నకి వాళ్లు బోలెడు తెల్లకాగితాలిస్తారు. కలాలు, సిరాబుడ్లు - అవన్నీ నేను ఒక్క నోటుబుక్కు కొనుక్కోనక్కర్లేదు. అవన్నీ నాకిస్తాడు మానాన్న.

కృ: (గట్టిగా) వెళ్లండోయి! ప్లీడరుగారంటే చాలాగొప్ప. గాంధీగారుకూడా మొట్టమొదట ప్లీడరు. మన ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూగారుకూడా ప్లీడరే మొదట్లో. తెలుసునా?

వే: (లేచి నుంచుని చేతులు తిప్పుతూ) ఆగరా కృష్ణా! ఆగు. అందరికంటే మేష్టారు గొప్పవాడు. అసలు మేష్టారు లేకపోతే పిల్లలుండరు. పిల్లలు లేకపోతే పెద్దవాళ్లేవాళ్లుండరు. పెద్దాళ్లవకపోతే ప్లీడర్లూ ఉండరు. డైరెక్టర్లూ ఉండరు. గుమాస్తాలూ ఉండరు చూశావా మరి (ఠీవిగా తలూపుతాడు)

రా: మీరిద్దరూ చెప్పింది రైటు కాదు గుమాస్తాలే గొప్పవాళ్లు. వాళ్లు లేకపోతే కాగితాలమీద రాసేవాళ్లుండరు. దానివల్ల కలాలు తుప్పట్టిపోతాయి. అప్పుడు - అప్పుడు.

సుం: అప్పుడు-అప్పుడు- (ఆక్షేపిస్తూ) నా మొఖం. నీ మొఖం. మీ నాన్న లందరికంటే మా నాన్న గొప్పవాడు. సినిమాలు తీసేవాడంటే ఏమిటో తెలుసా! బ్రహ్మ



దేవుడులాంటివాడు. మనుష్యుల్ని తెరమీద పుట్టిస్తాడు. చంపేస్తాడు, ఏడిపిస్తాడు. ఎన్నో గమ్మత్తులు చేస్తాడు.

కృ: (పెద్దగా అరుస్తూ) ప్లీడరే గొప్పవాడోయి! ప్లీడరు బుఱ్ఱకాయ చాలా పెద్దది.

సుం: (ఇంకా బిగ్గఱగా అరుస్తూ) కాదు. ముమ్మాటికీ కాదు. డైరెక్టరే గొప్ప. డైరెక్టరుబుఱ్ఱలో అంతా మెదడే.

కృ: కాదు. ప్లీడరేగొప్ప. ఒప్పుకుంటావా? ఒప్పుకోవా? (మీద కొస్తాడు)

సుం: నేను ఒప్పుకోనురా! చచ్చినా ఒప్పుకోను. (బింకంగా అంటాడు)

వే: ఒరేయి! మీయిద్దరూకూడా ఒఠ్ఠిబడుద్ధాయిలు. మీకు తలకాయలైతే ఉన్నాయికాని, అవిమాత్రం మీ శరీరానికి విలోమానుపాతంలో ఉన్నాయి. అంటే అందులో సరుకేమీలేదు. నాటకం మానేసి కొట్టుకు చస్తారేమిటి? ఇటువంటి వాళ్లకే ఇంగ్లీషులో చిన్న పేరుంది. ఇడియట్సని.

కృ: (కోపంతో) ఏడిశావు పోవోయ్!

సుం: తన్నులు తినగలవు. అట్టే వాగక.

రా: అదికాదురా! పెద్దఇంగ్లీషు వచ్చి ఏడిసినట్టుగా ఇడియట్సుట వీడికి. దానికి స్పెల్లింగు చెప్పరా. (వేణూని అడుగుతాడు)

వే: మన క్రొత్తమోడలు చదువులో స్పెల్లింగు రానక్కరలేదురా డాంకీ! మాట పలకడమే ముఖ్యం.

రా: డాన్కీ, గీన్కీ-అంటే ఊరుకొనేదిలేదు. జాగ్రత్త.

కృ: ఒరేయిసుందరం! డైరెక్టరుకంటే ప్లీడరు గొప్పవాడని ఒప్పుకొన్నావా లేదా?

వే: నువ్వు మరి మేష్టరుసంగతి ఒప్పుకుంటే! నేను వాడ్ని ఒప్పిస్తాను.

# ★ రిహార్సల్ ముచ్చట ★

సుం: నేను వస్తే ఒప్పుకోను. డైరెక్టరే అందరిలోకీ గొప్పవాడు.

వే: కాదు. మేష్టరు మహాత్ముడు.

కృ: ఎప్పటికీ కాదు. శ్రీ మహ సరస్వతీ అవతారం.

వే: కాదు.

కృ: అవును. (అని కేకలు గందరగోళం)

[శ్రీధరు విశ్వేశ్వరరావు ప్రవేశం]

వి: ఏమిట్రా యీగోలమంతా. యీ పోట్లాట లేమిటి? కేక లేమిటి?

[ఎవరూ మాట్లాడరు]

వి: (కృష్ణుడితో) ఏరా కృష్ణా! ఏమిటీగోల? మాట్లాడవేం?

కృ: (భయంతో) మరి. ఏం లేదు మాస్టా! మరి. మరి. వీళ్లు...

వి: (విసుగ్గా) వీళ్లూ లేరు. వాళ్లూ లేరు. పోండవతలకి. ఒక్కరోజు కెలవిస్తే చాలు. కొంపకి నిప్పెట్టే స్తారు. (అందరూ పరుగెత్తుతారు)

రంగము 2.

(అందరు వీధిలోకి వచ్చి సమా వేశమౌతారు)

కృ: (మిగిలినవాళ్లని చూసి) మాస్టాన్న అప్పుడే వస్తాడనుకో లేదు. ఇప్పుడెక్కడికి పోదాం? మన ముద్దబ్బాయి నాటకం రిహార్సలు చేయాలి కదా! ఎక్కడ కూర్చుందాం?

సుం: ఎక్కడేమిటి? మా యింటికి పోదాంరండి. మాస్టాన్న రాత్రి పదింటికిగాని రాడు.

రా: ఒరేయ్! గొప్పకిపోక నిజం చెప్పు. అక్కడ వీలులేకపోతే ఏటి ఒడ్డు మామిడితోపులోకి పద దాము.

సుం: భరవాలేదు. రండి. మా మేడమీద సూక్కాలు పెట్టినా క్రిందకి వినపడదు. ఏరా కృష్ణా! నాటకం పుస్తకం తెస్తున్నావా?

కృ: అరెరే! మర్చిపోయాను. ఇదిగో! ఇప్పుడే పరిగెత్తుకు వచ్చేస్తాను. ఉండండి. (కృష్ణుడు స్టేజిలోకి పోతాడు)

వే: ఒరే సుందరం! మన నాటకం ఎప్పుడు వేద్దాము?

రా: అయితే మనకి పాలేదిరా?

సుం: వెధవ బుర్రలు ఒకడికీ బ్రెయిను లేదు. మా మేడే చాలు. తెలిసిందా? డైరెక్టరు నేను. (తనని చూపించుకొని) సుందరరావుగారు. ముద్దబ్బాయి కృష్ణుడు. జతగాడు రాఘవుడు. ప్రైవేటు మేష్టారు వేణు. ఎలా ఉంది మన ప్లాను?

వే: బాగానే ఉందికాని మనం నలుగురూ వేషాలు వేస్తే చూసేవాళ్లెవరురా?

సుం: మన క్లాసు కుర్రాళ్లు లేరూ? వాళ్ళని పిలుద్దాం.

(కృష్ణుడు వస్తాడు)

కృ. ఇదిగోరా కాగితాలు పదండి.

సుం: ఒరేయి! మీరు జాగ్రత్తగా రండి. మా అమ్మ చూడకుండా మనం మేడయెక్కేస్తే తరువాత మనకేం భయంలేదు.

ముగ్గురూ: సరేలే! పదు

(తెరపడును)

రంగము 3.

(గదిలో కుర్చీలూ, బల్లలూ ఉంటాయి. తెరయెత్తగానే)

సుం: ఒరేయి! మీరు జాగ్

త్తగా వినాలి. చూడు కృష్ణా! నువ్వు బల్లమీద కూర్చోవాలి. వేణూ నువ్వు పైవేటు మేష్టారువి. గట్టిగా పొడుంపీల్చాలి. ఇదిగో బెత్తం పుచ్చుకో. (బెత్తం అందిస్తాడు) రాఘవా! నువ్వు కృష్ణుడి పక్కన కూర్చుని బిక్క మొహం పెట్టాలి. తెలిసిందా! ఇదిగో కాగితాలు పుచ్చుకొని చదవండి.

సుం: ఇక మొదలు పెట్టండి.

వే: (బల్లున పొడుంపీల్చి బెత్తం నేలమీద కొడ్తాడు.) ఏరా కృష్ణా! కాదు కాదు బాబ్జీ! పాఠం వచ్చిందా ?

కృ: (బెక్కుతో) ఆ! వస్తున్నట్టే ఉందండి.

వే: (గట్టిగా) ఏమిటి రా? ఏమిట్రా నేనన్నది? స్టుపిడ్.

కృ: స్టుపిడేనండి.

వే: ఎవడ్రా స్టుపిడ్.

కృ: అదే—మన మేనండి. కాదు కాదు.

వే: స్టుపిడంటావా రాస్కెల్! (కోపంతో వీపుమీద కొడతాడు)

కృ: ఒరేయ్! (బాధతో) అయ్ బాబోయ్! చచ్చాన్రోయ్! ఒరేయ్! మెల్లిగా కొట్రా. నేను తిరగబడ్డానంటే పచ్చడి చేస్తాను. సుందరం యీ వెధవ యిలాగ కొడితే నేనసలు యీ నాటకం వేయనే వేయను.

సుం: (గంభీరంగా) మెల్లిగా కొట్టరా వేణూ!

వే: అయితే మెల్లిగా మళ్లీ కొడ్తాను కూర్చోరా కృష్ణా!

సుం: అక్కర్లేదు. తరువాతిది కానీ!

వే: (కాగితం చూసి) ఏరా! బాబ్జీ! నిన్నే! పాఠం వచ్చిందా?

కృ: ఆఁ! వచ్చిందండీ!

వే: ఏదీ! అప్ప చెప్పు—లే (కృష్ణుడు లేచి చేతులు కట్టుకుని)

కృ: మొల్ల కుండలు చేసుకొనే అమ్మాయి. కుండలు సరిగ్గా రాక పోతే ఏడుస్తూ పద్యాలు రాసుకునేదండీ! ఆ మటుకు- ఆ పద్యాలే రామాయణం అయిపోయాయండీ- తరువాత- తరువాత—

వే: నీ బొంద-నా బొంద - ఈ పాఠం ఏ పుస్తకంలో ఉందిరా ? చవటా—

కృ: పుస్తకం చూసి నేను నోట్సు రాసుకున్నానండి. అల్లా చేయమన్నారు కదండీ. అదే బట్టీ వేశాను.

వే: నీ నోట్సు మండినట్టే ఉంది. పుస్తకం చదివేడు. సరే! నేను ప్రశ్నలడుగుతాను. వాటికన్నా సమాధానాలు చెప్పియేడు. ఊఁ! బమ్మెరపోతరాజు ఏం రాశాడు?

కృ: సోషలు స్టడీసుబుక్కు వ్రాశారండీ! వెంకటరామా అండుకో వాళ్లు ప్రింటు చేశారు కూడానండీ.

వే: ఓరి నీ మొహం మండ. సోషలుస్టడీసుపుస్తకం బమ్మెర పోతరాజు వ్రాశారా! ఇంక నీకు చదువెందుకూ! నువ్వు చెప్పరా రాఘవా!

రా: మరేమోనండి - మరేమోనండి - కృతులు రాశాడండి. ఆడపిల్లలు పాడుకొంటారండి.

వే: నిన్ను పుటం వెయ్యాలిరా! కృతులు రాసినాయన త్యాగరాజుగారు - భాగవతం రాసినాయన పోతరాజు - రేపు వందసార్లు యింపోజిషను రాసుకురండి. భారతంలో ఆదిపర్వం ఎవరు రాశారురా?

కృ: ఆ! ఆ! నేను చెబుతానండి. - ఆయనే కదండి. మొన్న హిమాలయాపర్వతాల్ని ఎక్కాడు? ఆఁ! అద్గది. టెన్సింగండి.

వే: నువ్వు గాడ్దువి. నోరు మూసుకో! నోరుమూసుకో!

రా: నేను చెప్పనాండి మాష్టారూ?

వే: ఊఁ! ఏదు—

రా: భట్టుమూర్తిఅండి -

వే: మీపాండిత్యం తగలెయ్య. భట్టుమూర్తి భారతం రాశాడా? మీకంటే జంతువులు నయంరా! సుందరం! నా పోర్షనుకాగితం పోయిందిరోయి! ఇప్పు డెలాగ?

సుం: పోలేదు. ఇదిగో! గాలికి ఎగిరిపోయింది. (వేణూ తీసుకొని)

వే: సరే! తెలుగు అంత

# ★ రిహార్సల్ ముచ్చట ★

అయింది. ఇంక యింగ్లీషు ఎల్లా ఉందో ఏడవండి. (బుఱ్ఱన పొడుం పీలుస్తాడు) మాటలో ఎక్కడన్నా "యల్" వస్తే ఆమాటని ఎల్లా పలకాలని చెప్పానురా!

కృ: ఒత్తిపలకాలండి. టాల్క్! వాల్క్!

వే: నిన్ను కోసినా నీకు చదువు రాదు - ఏది వద్దంటే అదే అఘోరిస్తావే! (కొడతాడు. కృష్ణుడు ఏడుపు)

వే: నువ్వు చెప్పురా ఎల్లా పలకాలో?

రా: చెప్తానండి!

వే: చెప్పేడు. ఆ నంగినేషాలు ఏమిటి?

(బెత్తం నేలమీద కొడతాడు.)

రాఘు: మరండి! - కొంచెం పలకాలండి! ఉల్డు! షుల్డు! కుల్డు! అల్లాగండి!

వే: (కోపంతో) నీపీపు చీరినా పాపంలేదు. (కొడతాడు) (రాఘువుడూ, కృష్ణుడూ ఏడుస్తూంటారు).

రా., కృ: ఒరేయి సుందరం! వేణుగాడు నిజంగా మేష్టారు అనుకుని మమ్మల్ని బాదుతున్నాడు. మేం యీ నాటకంలో వేషం వెయ్యం.

వే: (ఠీవిగా) మరి పాఠం రాకపోతే కొట్టక ఏంచేస్తారేమిటి? ఈ నాటకంలో వేషాలు వెయ్యాలంటే తన్నులు తినవలసిందే!

రా: గొప్ప చదివినవాడిలా మాట్లాడుతున్నావు ఏమిటిరోయ్! మన హాఫియర్లీ పరీక్షల్లో యమున్ని సావిత్రి కత్తితో పొడిచి చంపిందని రాసి తెలుగు మేష్టారుచేత చచ్చేట్టు దెబ్బలుతిన్న మన చదువే చెప్పాలి.

కృ: (ఉక్రోషంతో) అవును. వాడి బ్రతుక్కి నాటకాలలో తప్ప నిజంగా ఎప్పుడన్నా మేష్టారు అయ్యేది ఉందా! అందుకనే మనని తంతున్నాడు-ఏరా వేణూ! మొన్న మనకి యింగ్లీషులో సున్న మార్కులు వచ్చాయిరా?

వే: ఎన్నో వచ్చాయి నీకెందుకు?

కృ: కంగారుపడక చెప్పదూ!- (దగ్గరకెళ్ళి బుజ్జగిస్తూ) పది దాటలేదుకదూ! అమ్మకదూ! చెబుదూ!

వే: (ఉక్కురోషంతో) మీకెందుకూ? పొండి - అసలు నేను నాటకం వేయనే వేయను. నేను వెళ్ళిపోతున్నాను సుందరం.

సుం: వేణూ! అల్లా ఉడుక్కుంటావేమిటి? సరదా లేదు - ఏమీ లేదు.

వే: నాకు అక్కరలేదు యీ వేషం. (వెళ్ళిపోతాడు.)

కృ: ఒట్టి దున్నపోతు. ఏం సరదా లేదు. పోతే పోనీయి!

సుం: సంతోషంలేదు. అంతా పాడుచేశాడు. అన్నట్లు- లెక్కలు హోంవర్కు చేశావా? రేపు బడి-

కృ: అయ్యో బాబోయ్! చెయ్యలేదురోయ్! ఇప్పుడు వెళ్ళి చెయ్యాలి.

రా: అవునురోయి! నేనూ చెయ్యాలి - ఇక పోదాం పదరా కృష్ణా! ★




## జరిగిన కథ

[మా నాన్నగారు—మిస్యూ ఐసెట్టీ—లాన్గ్యుడాక్ లో పెద్ద సిల్కు వ్యాపారి. సొంత ఫ్యాక్టరీ అది వుండేది. నేను (చిన్నా) పుట్టినరోజు లగాయతూ మా కుటుంబాన్ని ఏదో ఒక అపద చుట్టు ముట్టేస్తూనే వుంది. చివరికి దేశంలో వచ్చిన విప్లవం మూలంగా మా నాన్నగారిస్థితి పూర్తిగా చితికి పోయింది. కొంతకాలానికి మా నాన్నగారు దివాళా తీసి మా ఫ్యాక్టరీని అమ్మేశారు. మేము మా స్వస్థలం విడిచిపెట్టి లయన్స్ పట్టణానికి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ ప్రయాణంలో నా చిలుకను పోగొట్టుకొన్నాను. ఒక పెద్దమనిషి సహాయంతో నేనుమాత్రం లయన్స్ స్కూలులో స్కాలర్‌షిప్ విద్యార్థిగా చేరాను. చేరిన మొదటిరోజే నా బట్టలు చూసి పిల్లలు ఎగతాళి పట్టించారు. మేష్టారికి నేనంటే ఎందుకో గిట్టలేదు. నన్ను ఆయన 'డింభకొనముడ'ని పిలవటం మొదలుపెట్టాడు. నాకా పేరే తగులుకొంది. ఇలావుండగా మా పెద్దన్న 'ఎబ్బీ'కి జబ్బుచేసిందని జాబు రావటమూ, మా అమ్మ, జాక్ అన్నయ్య అక్కడికి వెళ్ళడమూ జరిగింది. వాళ్లు వెళ్లిన కొన్ని గంటలకే పెద్దన్న పోయాడని టెలిగ్రాం వచ్చింది. అతని అంత్యక్రియలు పూర్తయ్యాక మా అమ్మ, జాక్ తిరిగివచ్చారు. ఆ తరువాత కొంతకాలానికే మా నాన్నగారు వ్యాపారంలో మళ్లా దెబ్బతిన్నారు. మా సంసారం రెండో సారి చితికిపోయింది. ఉన్న నలుగురం విడిపోవలసి వచ్చింది. మా అమ్మని పుట్టింటికి పంపేశాం. జాక్‌ని లయన్స్‌లోనే ఒకచోట్లో గుమాస్తాగా చేర్చారు మానాన్న. తను సారా వుత్పత్తిదార్ల సంఘంతరఫున ఒక వుద్యోగం సంపాదించుకొన్నారు. నన్ను తనదగ్గరకు పంపితే దాక్షిణాత్య విశ్వవిద్యాలయంలో 'అషర్' వుద్యోగం యిప్పిస్తానని మా నాన్నగారి స్నేహితుడైన 'రెక్టర్' జాబు రాశాడు. ఉద్యోగార్థినై బయలుదేరి సరాసరి ఆయన వున్న వూరికి వెళ్ళాను. ఆయన నన్ను 'సర్లానీడీ' కాలేజీలో వుద్యోగానికి పొమ్మని సలహా యిచ్చి సిఫార్సు వుత్తరం రాసియిచ్చి, వెంటనే ఆ వూరికి వెళ్ళమన్నాడు.]

### 5. ఉదర విచిత్రం

'సర్లానడీ' అనేది 'సెవెన్నెస్' ప్రాంతంలోని చిన్న బస్తీ. దానికి నాలుగువైపులా కొండలు గోడలు కట్టినట్లు వుంటాయి. అందుచేత ఆ వూళ్లో ఎండలుకాస్తే విపరీతంగా కాస్తాయి; కుంపటిలో కూర్చున్నట్లే వుంటుంది: చలిగాడ్పులు వీస్తే విపరీతంగా వీస్తాయి; నరాల్లో రక్తంకూడా గడ్డకట్టుకుపోయేట్లు వుంటుంది.

నేనా వూళ్ళో కాలుపెట్టినరోజు, పొద్దుట్నుంచి యీదురుగాలి వీస్తునే వుందట. ఆ గాలిలో బండిటాపుమీద కూర్చుని అంతదూరం ప్రయాణం చేశానేమో—ఆ వూళ్ళో అడుగుపెట్టగానే ఒంతా గడ్డకట్టుకు పోతుందేమోననిపించింది.

అప్పటికే కనుచీకటి పడుతోంది. వీధుల్లో ఎక్కడా దీపాలులేవు; జనసంచారమూ లేదు. పొరుగూళ్లనుంచి బండ్లువచ్చి ఆగేచోటమాత్రం కొద్దిమంది మనుషులు కదులుతున్నారు.

మా బండివచ్చి అక్కడ ఆగగానే తొందర తొందరగా టాపుమీదనుంచి కిందకు దిగివచ్చాను. అక్కడ వున్నవాళ్లను కాలేజికి దారి ఏదో చెప్పమని అడిగాను: ఉద్యోగంలో చేరెయ్యాలని నాకు అంత తొందరగా వుంది.

బండ్లు ఆగేచోటుకీ కాలేజికీ అట్టే దూరంలేదు

అనువాదం: విశ్వాత్ముల నరసింహమూర్తి



# అన్నా - చిన్నా



నా పెట్టె మోసుకొచ్చిన కూలివాడు జనసంచారంలేని రెండుమూడు వెడల్పాంటి వీధుల్లోగుండా నన్ను నడిపించుకువెళ్ళి, పెద్ద భవంతిలాంటి ఒక కట్టడంముందు ఆగాడు. అదే కాలేజి. అదేమిట్లో పైకి చూడటానికే యీ భవనానికి సంబంధించిన ప్రతిదీ కొన్ని శతాబ్దాల క్రితమే చచ్చి జీర్ణమైనట్లు అనిపించింది.

"ఇదేనండి కాలేజి" అంటూ కూలివాడు గేటు మీదవున్న పెద్ద యినపదిమ్మ ఎత్తి రెండుమూడు సార్లు కొట్టాడు. కొద్దిసేపట్లో గేటు తెరవబడింది. ఇద్దరమూ లోపలికి వెళ్లాం.

చీకట్లో సావిట్లో ఒంటరిగా నిలబడ్డాను. నా సామాను తెచ్చినకూలివాడు పెట్టె అక్కడ దించేసి కూలిడబ్బులు చేతులో వేయించుకు చక్కా పోయాడు...వాడటు వెళ్లి వెళ్లగానే బ్రహ్మాండమంత గేటూ మూసుకుపోయింది...మరికొన్ని క్షణాలు గడిచాక నిద్రకళ్ల గేటుకాపరి ఒకడు, పెద్దసైజు లాంతరు ఒకటి చేత్తో పట్టుకు నాదగ్గరకు వచ్చాడు. లాంతరు వెల్తురులో నన్ను తేరిపారచూసి "కాలేజీలో చేరటానికి కొత్తగావచ్చిన స్టుడెంటా?" అని బొంగురు గొంతుకతో అడిగాడు.

నన్నుచూసి స్టుడెంట్ అంటాడా వీడు?

"కాదు. ఇక్కడ 'అవర్' ఉద్యోగంలో చేరటానికి వచ్చాను. ప్రిన్సిపాల్ ఎక్కడున్నారు?" అన్నాను కొంచెం అధికార స్వరంతో.

కొరడాదెబ్బ తిన్నవాడి ముఖంలా అయిపోయింది, వాడిముఖం. నెత్తినవున్నటోపీ గౌరవసూచకంగా కొంచెం పైకెత్తి, ప్రిన్సిపాల్‌గారు పిల్లలచేత ప్రార్థనలు చేయిస్తూ చర్చిలోవున్నారనీ, కొద్దిక్షణాలలో అది పూర్తికాగానే ఆయన్ను కలుసుకోవచ్చుననీ, అందాకా నన్ను 'లాడ్జి'లో వేచివుండవలసిందనీ అతి మర్యాదగా చెప్పాడు.

లాడ్జిలో ఎవరెవరో కూర్చుని ఫోం చేస్తున్నారు. సన్నగా పొడుగ్గావున్న మీసాల ఆసామీ ఒకడు గ్లాసులో సారా పోసుకు చప్పరిస్తున్నాడు. అతని పక్కనే పసుపు కొమ్ములా పాలిపోయిన రోగిష్టి ఆడది ఎవరో కూర్చునివుంది; రంగువెలిసిన శాలువా చెవులదాకా కప్పుకుంది. మేము లోపలికి రావటం చూసి "ఏవిటండీ 'కసాగ్నె'గారు, విశేషం?" అని గేటుకాపలావాణ్ణి అడిగాడు, ఆ మీసాలాయన.

"కొత్త 'అవర్'. వీర్ని చూసి మొదట ఎవరో స్టుడెంటు అనుకొన్నాను; అంత పొట్టిగా వున్నారు! హి...హి...!"అన్నాడు గేటు కాపలావాడు, నన్ను చూపిస్తూ.

సారా గ్లాసు అంచుమీదనుంచి నా వంక సూటిగా చూస్తూ, "మీరు క్షమిస్తే ఒకమాట చెప్తాను; మీ కంటే వయస్సులోనూ, ఎత్తులోనూ పెద్దవాళ్లుగా కనుపించే విద్యార్థులే యిక్కడ ఎంతోమందివున్నారు. ఉదాహరణకి వెయిలెన్ మేజర్!"

"క్రొజట్" గేటుకాలావాడు యింకో పేరు చెప్పాడు.

"సేబియరాల్"—చివరికి ఆ జబ్బు వొంటి ఆడదికూడా తగుదునమ్మా అని, తనూ ఒక పేరు చెప్పింది. అంతటితో వారుభయులూ వీరవిద్యార్థుల నామావళి అప్పచెప్పటం మానేసి, అ చచ్చు సారా గ్లాసుల అంచుల మీదగా నా వంకవోరచూపులు చూస్తూ, ఒకరి చెవిలో ఒకరు ఏమిటో గుసగుసలాడుకోవటం మొదలుపెట్టారు. బయటనుంచి రయ్యి రయ్యిమని వీచే యీదురుగాలిహోరు, అవతలదూరంగా చర్చిలో విద్యార్థులు ఏక కంఠంతో పాడే ప్రార్థనా గీతాలు ఒకే శ్రుతిలో వినిపిస్తున్నాయి. ఇంతలో పెద్ద గంట ఏదో గణగణమోగింది; దాంతో పాటు హాలు గచ్చునేలమీద అనేకమంది కలిసి నడుస్తున్నట్లు అడుగులచప్పుడు వినవచ్చింది.

"ప్రార్థన ఐపోయింది."అంటూ గేటు కావలావాడు కూర్చున్నచోటునుంచి లేచాడు. మేడమీద ప్రిన్సిపాల్‌గారి గదికిపోదాం రమ్మన్నాడు.

లాంతరు తీసుకు తనుముందు నడిచాడు. నేను అతని వెనకాలే అడుగులో అడుగువేసుకొంటూ వెళ్ళాను.

కాలేజి భవనం చాలా పెద్దది. ఎంతదూరం నడిచానో, ఎన్నిగదులు, మెట్లవరసలు దాటానో లెక్కలేదు. ఎంతదూరం నడిచినా అంతమునేది కని

పించటంలేదు. అంతకు పూర్వం యీ భవనంలో నాకాదళ్ళానికి సంబంధించిన కాలేజీ వుండేదనీ, అప్పట్లో పేటా కులీనకుటుంబాలకు చెందిన ఎనిమిది వందల మంది యువకులకు యిక్కడ శిక్షణ యిస్తుండే వారనీ గేటు కాపలా వాడు నాతో చెప్పాడు.

ఈ మాటలు అంటుండగా ప్రిన్సిపాల్ గారి గది చేరాం.

గేటు కాపలా వాడు గది తలుపులమీద భయం భయంగా రెండుసార్లు తట్టాడు. "లోపలికి రావచ్చు" అనే మాటలు వినవచ్చాయి.

తలుపులు తెరచుకు లోపలికిపోయాం. అది చాలా పెద్దగది. గోడలనిండా అమూల్యచ్ఛరంగు కాగితాలు అంటించివున్నాయి. గదికి ఆ చివరను పెద్ద మేజాబల్లవుంది. దానిమీద పేడ్ కప్పివున్న లాంతరు ముందుకూర్చుని ప్రిన్సిపాల్ గారు అతి గంభీరంగా ఏదో రాసుకొంటున్నారు.

"ఎమ్. పెరియర్ గారి స్థానంలో పనిచేయటానికి కొత్తగావచ్చిన మాస్టారు" అంటూ నన్ను ముందుకు నెట్టాడు గేటు కాపలా వాడు.

"మంచిది" అన్నాడు ప్రిన్సిపాల్, తల అయినా ఎత్తకుండా.

గేటు కాపలా వాడు తలవొంచుకు రాసుకొంటున్న ప్రిన్సిపాల్ గారికి వొంగి సలాం చేసి, తన దారిని తను చక్కాపోయాడు. అంత పెద్దగదిలోనూ, పేరడంత మనిషిని నేనొక్కణ్ణే బిక్కుబిక్కుమంటూ నిలబడ్డాను. నెత్తిమీదనుంచి తీసి పట్టుకొన్న టోపీని ఊబుసుపోక కోసం వేళ్ళతో తిప్పుతున్నాను.

తను చేస్తున్న పని సాంతం అయ్యాక ప్రిన్సిపాల్ గారు తలఎత్తి నా వంక చూశారు. లైటు వెలుతురులో ఆయన ముఖాన్ని పరీక్షగా చూశాను. ముఖం చాలా చిన్నది; ముడతలుపడి, యీడ్చుకుపోయినట్లుంది. ఆ ముఖం అంతటిలోకీ కళకాంతులు లేని గాజుకళ్ళ లాంటి ఆ రెండుకళ్ళే అందరికీ ముందుగా అగుపిస్తాయి. నే నాయన ముఖలక్షణాలు పరీక్షించినట్లే, ఆయన కూడా నా ముఖలక్షణాలు పరీక్ష చెయ్యటానికిగాను దీపంమీదవున్న పేడ్ ఒకపక్క పైకిఎత్తి, ఒంటికంటి అద్దం ముక్కుపూలానికి తగిలించుకు నా వంక తేరి పార చూడటం మొదలుపెట్టాడు.



పొల్లడి

చిత్రకారిణి: బి. నిర్మల ([illegible]); పెద్దాపురం.

ఆయన దృష్టికి నేను బాగా ఆనగానే "అరె! ఇంత పసివాణ్ణి పంపించారేమిటి యిక్కడ ఉద్యోగానికి" అని ప్రకాశంగా స్వగతం పలుకుతూ, కుర్చీలోంచి హఠాత్తుగా పైకి లేచి ఆశ్చర్యంగా చూడబట్టారు.

దాంతో నాగుండెల్లో రాయిపడ్డది. నేను కట్టుకొన్న ఆశాసౌధాలు అన్నీ ఒక్క దెబ్బతో నేలమట్టానికి కూలిపోయాయి. నిరుద్యోగినై వీధుల్లో ఒంటరిగా తిరుగుతున్నట్లు నన్ను నేను



# అన్నా - చన్నా



భూహించుక్కు బాధపడ్డాను. నోరు మెదిపి మాట్లాడటమే మహాకష్టమైంది. అయినా ఎంతో ప్రయత్నం చేశాను. ఏం మాట్లాడానో ఏమో నాకు వొళ్లు తెలియదు. రెక్టరు రాసియిచ్చిన సిఫార్సు వుత్తరం మాత్రం జేబులోంచి తీసి ఆయన చేతికి అందించాను.

ప్రిన్సిపాల్ జాబుతీసుకొన్నాడు; చదివాడు; మళ్ళీ చదివాడు; చదివి మడతపెట్టాడు; పెట్టిన మడతలు అన్నీ విప్పి మళ్లీ యింకోసారి చదివాడు. చదివి



చిత్రకారిణి చామకూర సిరిదేవి

చాలాసేపు ఆలోచించి, నాకు యీ ఉద్యోగానికి తగ్గయీడు లేకపోయినా, నన్నుగురించి 'రెక్టరు' అంత బాగా సిఫార్సు చేసినందువల్లా, నేను పుట్టింది గౌరవనీయమైన కుటుంబం అయినందువల్లా, నన్ను ఆవుద్యోగంలోకితీసుకోవటానికే తను నిశ్చయించానని చెప్పాడు. ఆ మరుక్షణమే ఆ వుద్యోగమూ, అందులోవుండే బాధ్యతలు, వాటిని నెరవేర్చటంలో నేను తీసుకోవలసిన జాగ్రత్తలు వగైరా విషయాలను గురించి ఏకబిగిని పెద్దలెక్చరు ఒకటి దంచి పారేశాడు. ఆయన అంత కంఠశోషపడి చెప్పుతున్నా, నేను అందులో ఒక్కముక్క-అయినా వినిపించుకోలేదు. నా మనస్సు అన్యథా ఆలోచనలలో మునిగివున్నది.

హమ్మయ్య!—తగినంత ఒడ్డూ పొడుగూ లేని కారణంచేత నన్ను వెనక్కి పొమ్మనటంలేదు. అంతే చాలు. ఆ ఒక్క ఆలోచనతోనే నా వొళ్లుపరవశమైపోయింది. అంతమంచి మాట శెలవిచ్చినందుకు ప్రిన్సిపాల్ గారిని వెయ్యినోళ్లతో వినుతించాలనిపించింది.

నా కృతజ్ఞతా భావాన్ని రకరకాలుగా ప్రిన్సిపాల్ గారికి చెప్పుకొంటూవున్నాను; ఉన్నంతలో నా వెనుక యినుపతాళం చెవులగుత్తులు ఏవో భయంకరంగా గలగలలాడటం మొదలుపెట్టాయి. ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాను. పొడుగ్గా, బక్కపలచగా ఒకమనిషి నిలుచుని వున్నాడు. రాగి రంగు బుంగమీసాలు వున్నాయి. గదిలోకి ఎప్పుడు వచ్చాడో కాని కాలేజికి నిశ్శబ్దంగా వచ్చాడు. అతనే యీ స్కూలుకి సూపరింటెండెంటు; తరువాత తెలిసింది.

కొంగలా మెడ ఒకపక్కకు వేళ్లాడేసుకు చిరునవ్వులు ఒలకబోస్తూ నావంక తదేకంగా చూస్తున్నాడు. అంతసేపూ తాళం చెవుల గుత్తులను మాత్రం ఆపకుండా ఆడిస్తూనేవున్నాడు. ఆనవ్వు ఒక్కటేఅయితే మాత్రం నా కాతనిపట్ల తప్పకుండా అతి ఆత్మీయమైన అభిప్రాయమే ఏర్పడివుండేదేమోకాని, అతని తాళం చెవుల గుత్తులు చేస్తున్న చప్పుడు మాత్రం నన్నెందుకో విపరీతంగా భయపెట్టింది.

"మిస్యూ వియట్; ఈయన ఎం. సెక్రియర్ గారిస్థానంలో పనిచేయటానికివచ్చిన కొత్త 'అమర్'.

ఇప్పుడే వచ్చారు." అన్నాడు ప్రిన్సిపాల్, నన్ను ఆమనిషికి పరిచయంచేస్తూ.

మష్యూ వియట్ వెంటనే నావంక తిరిగి, ముఖారవిందంపై మధురాతిమధురమైన మందహాస వీచికలు అలముకోగా అతి వినమ్రభావంతో తలవంచి నాకు నమస్కరించాడు. అతనిచేతినున్న తాళం చెవులుమాత్రం వొళ్లుమండే వ్యంగ్యార్థాలు స్ఫురింప చేస్తూ గరగరలాడాయి. 'ఎం. స్క్రియర్ లాంటివాడి స్థానంలో పనిచేయటానికి యీ మరిగుజ్జా వచ్చింద'ని అవి అంటున్నట్లు నాకు అనిపించింది.

ప్రిన్సిపాల్ గారికికూడా వాటిచప్పుడులో అదే మాదిరి అర్థంస్ఫురించినట్లుంది. వెంటనే ఆయన అందుకొని "ఎం. స్క్రియర్ గారు వెళ్ళిపోవటంవల్ల మన కాలేజీకి తీరనిలోటు ఏర్పడుతుందని నాకూ తెలుసు"—(ఆ వాక్యం పూర్తి అయ్యేసరికి తాళంచెవులు వెక్కి-వెక్కి-ఏడ్చాయి)—"అయినప్పటికీ మీరు కొంత శ్రద్ధ తీసుకొని యీ కొత్తమాస్టారికి కొంతకాలంపాటు ఇక్కడి కట్టుబాట్లనిగురించి బాగా తెలిసేట్లు చెప్పితే, ఆ కొరత కొంతమటుకు తీరుతుందనుకొంటాను." అన్నాడు.

చెక్కు-చెదరని చిరునవ్వుతో, తీయనైన కంఠస్వరంతో మష్యూ వియట్ ప్రిన్సిపాల్ గారు చెప్పిన దానిపట్ల తన ఆమోదాన్ని తెలుపుతూ, తన ఆదరణ, తనసలహా నాకు ఎల్లవేళలా వుంటాయనీ అన్నాడు. నోటితో ఆమాటలు అంటూ, చేతితో తాళం చెవులు గలగలలాడించాడు. వాటి గలగలలో "జాగ్రత్త! నాచేతిలో చిక్కావులే. ఇంకెక్కడికి పోతావ్!" అని నన్ను ఎవరో ఎందుకో బెదిరిస్తున్నట్లు అనిపించింది.

"మీరిక వెళ్లవచ్చు. ఈరాత్రికి ఎక్కడన్నా హోటల్ లో పడుకొని, పొద్దునే ఎనిమిదిగంటలకల్లా యిక్కడ డ్యూటీకి రండి." అన్నాడు ప్రినిపాల్ నావంక తిరిగి.

వాకిలిదాకావచ్చిన వియట్, చిరునవ్వులు నవ్వుకొంటూ నాచేతిలో చిన్నపుస్తకం ఒకటి పెట్టి "మన కాలేజి కట్టుబాట్లు అన్నీ యిందులో రాసి వున్నాయి. రాత్రికి చదివి, బాగా మననంచేసుకోండి." అన్నాడు, హెచ్చరిక ధోరణిలో.

తలుపుతెరిచి నన్ను అవతలకు సాగనంపి నా వెనకాలే మళ్ళీ తలుపులుమూసి తాళంవేసి, తాళం చెవులు చప్పుడుచేసుకుంటూ పోయాడు.

చీకట్లో అంతంత పెద్ద వసారాల్లో గోడలు తడుముకొంటూపోతున్నాను. మధ్యమధ్య చూరుల సందుల్లోనుంచి వెన్నెల కత్తిరించిన పాలకోవా ముక్కలా వచ్చి గచ్చునేలమీద పడుతోంది. ఆ వెన్నెల వెలుగు సాయంతోనే ముందుకు చొచ్చుకు పోతున్నాను.

(ఇంకా వుంది)

# కరణం ధర్మయ్య

కొన్ని సంవత్సరముల క్రితము ధర్మయ్య అనే ఆయన భావనగరానికి కరణంగా వుండేవాడు. పేరు ధర్మయ్య అయినా పిల్లికి బిచ్చము పెట్టని మనిషి. తను ధర్మము చెయ్యకపోగా బీద ప్రజల వద్దనుండి మామూళ్లు అనే పేరుతో డబ్బు గుంజుతూ, పీడిస్తూ వుండేవాడు.

ఒక రోజున ఒక పండితుడు ఆ వూరికి వచ్చాడు. ఆ వూరి పెద్దలందరివద్ద వారలు యిచ్చిన డబ్బు ప్రోగుచేసుకొన్నాడు. షుమారుగా 200-0-0 వరకు అయింది. ఆశకు మితము అనేది వుండదుకదా — యింకా కొంతమంది పెద్దమనుష్యులను చూచిన వాళ్లకు తోచిన పైకము యిత్తురనే వుత్సాహంతో కరణంగారివద్దకు వెళ్లాడు. వారికి తోచిన సహాయం చేయవలసినదిగా ప్రార్థించాడు.

మన కరణంగారి సంగతి తెలుసుగా — రాబట్టటమే తెలుసుగాని యివ్వటము అనేది ఆయన జన్మలో తెలియదు. కాసేపు ఆలోచించి ఆ పండితునితో చెప్పాడు. "మీరు పెద్దలు. మరియు పండితులు. మిమ్ములను సత్కరించుటలో మా గ్రామస్థులతోపాటు నేనుగూడ తప్పక పాలుపంచుకుంటాను. కాని దానికన్న ముఖ్యమైనది యింకొకటి వున్నది. ఈ వూరిలో వసూలైన మొత్తములో రూపాయికి 0-1-0 చొప్పున కరణమునకు యివ్వటం ఆచారం. దాని ప్రకారం మీకు రు. 200-0-0 లు వసూలైనదిగాన రు. 12-8-0 లు నాకు రావలసివున్నది. అందులో పండిత దక్షిణగా నేను యివ్వదలచుకొన్న అయిదు రూపాయలు పోను మిగతా 7-8-0 మీరు చెల్లించుకు వెళ్లవలయును."

విన్నాడు పండితుడు — ఆ రెండు వందలతో సంతుష్టి పడిపోకుండా యిచ్చుటకి ఎందుకు వచ్చితినా అని విచారపడ్డాడు. కాని చేయుటకు ఏమియు వుపాయము తోచలేదు. కరణం ధర్మయ్య అంటే సామాన్యుడా — యివ్వక తప్పిందిగాదు. రు. 7-8-0 చెల్లించి తక్షణం సెలవు తీసుకొనిపోయాడు ఆ పండితుడు.

ఆ దినసమయములో ధర్మయ్యగారి భార్య వచ్చి ఎల్లావు చావుబ్రతుకులలో వున్నదని, ధర్మయ్యగారిని వచ్చి చికిత్స చేయించమని చెప్పింది. వెంటనే ధర్మయ్యగారు దగ్గరలో వున్న పెట్టెవానిని కేక వేసి రు 7-8-0 చెల్లించుకుని వెళ్లిన పండితుని పిలుచుకు రావలసినదిగా చెప్పాడు. పండితుడు దాదాపు వూరి పొలిమేరవరకు వెళ్ళాడు. మళ్ళా ఈ వార్తవిని వెళ్ళటమా-మానటమా అని తటపటాయించి కరణం ధర్మయ్యగారి మాటకాదంటే దగ్గర వున్న పైకంగూడా దక్కదనే వుద్దేశ్యంతో తిరుగువచ్చాడు.

ఆవు యింకా చావలేదు - ఎక్కువ గంటలు బ్రతకదుగూడ. పండితుడు వచ్చినదే తడవుగా తిలలు తెప్పించి ఆగోవును, ఆ పండితోత్తమునకు దానము చేశాడు. ఈ అసామాన్య దాతృత్వమునకు పండితుడు ఆశ్చర్యముతో తన అదృష్టమును పొగడుకొనుచు ఆగోవును తోలుకొని పోవు సన్నాహములో పలుపు కొని తెచ్చుటకై అంగడికి వెళ్లెను. ఈలోపుగా గోవు చనిపోయెను. ఇంకను బేరమాడుచున్న పండితుని కబురుచేసి వెంటనే గోవును బయటకు తీసుకుపోవలసినదిగాను, తోకకు మామూలు నాలుగు రూపాయిలు చెల్లించవలసినదిగాను హుకుంచేశాడుధర్మయ్య. పంతులు. దాదాపు గుండెఆగిపోయినంతపనైనది ఆ పండితోత్తమునకు. నోట్లోనుండి మాటగూడ పెగిలి రావటంలేదు. కొంతసేపటికి తెలివిలోకివచ్చి కరణంగారియింటికి వచ్చుటయే తన దురదృష్టమని వగచి వూరిలో కొందరుమనుష్యులను బ్రతిమాలి తీసుకువచ్చి గోవును బయటకు తీసుకు రావటము - తోకకు మామూలు కరణంగారికి

చెల్లించటం జరిగిపోయింది. ఈ మామూళ్లు కూలి పైకము యిచ్చుకునిపోగా మిగిలిన పైకముతో వెనుకకు తిరగనైనా తిరగకుండా పోయాడు ఆ పండితుడు.

ఈవిధముగా ధర్మయ్య అన్యాయములకు పాల్పడుతూ ఆవూరివారందరితోను విరోధము కొని తెచ్చుకున్నాడు. ప్రతివారు ధర్మయ్య వద్దకు వెళ్లుటకు భయపడేవారు. ఇట్లా ఉండగా ధర్మయ్య మంచాన పడ్డాడు. అవసానకాలము దగ్గరకు వొచ్చింది. తను చేసిన పాపములన్నీ నెమరు వేసుకొన్నాడు. తను ఎక్కువ కాలము బ్రతకనని నిశ్చయించుకొని ఆవూరి పెద్దలను పిలువనంపాడు.

ధర్మయ్య దగ్గరకు పోవటం అంటే మాటలా కాని ఇప్పటి ధర్మయ్య పూర్వపు ధర్మయ్య కాదు - ప్రస్తుతం ధర్మయ్య చావుబ్రతుకుల ధర్మయ్య. చనిపోయే వాడిని సాధించేదేమిటి అనే తలంపుతో ఆ వూరి పెద్దలు కరణంగారిని చూచేటందుకు వెళ్లారు.

పాపము అవసానదశలో వున్నాడేమో - వూరి పెద్దలందరికీ అప్పగింతలు చెప్పాడు — అంతటితో ఆగలా! తను ఒక కోరిక కోరతానని అది చేస్తామని వాగ్దానము చేయవలయునని ఆ పెద్దలను కోరాడు. కరణంగారితో సంబంధము కొరివితో తల గోక్కొనటముతో సమానమని వారలకు తెలుసు. కాని అవసానదశలో వున్న వాని కోరికలు స్వల్పముగా వుండునని తలచి పెద్దలంతా మాట యిచ్చారు. దానిపై కరణంగారు కోర్కె బయలుపరచారు. "తాను సన్యాసము స్వీకరించాలని వున్నదని - తనకు ఒక సమాధిని కట్టించి సమాధి చేయవలయునని." పెద్దలు చూడవచ్చినవారంతా ఆలోచించారు. సమాధి కట్టటమంటే మాటలా? కనీసం రు 100-0-0 అయినా కావాలి. చివరకు వారంతా దానికి అంగీకరించారు— సంతోషించారు కూడ! ఆనాటితో పీడ విరగడైపోతుందని. సమాధి చేశారు కరణం ధర్మయ్యను.

అది యమలోకం—పాప పుణ్యములు చేసిన వారలకు ఫలితములు యిచ్చే లోకం. యమధర్మరాజు చిత్రగుప్తుడు, కింకరులు ఆసీనులై వున్నారు. చనిపోయిన వారందరు వస్తున్నారు. ఫలితములను అనుభవించుచున్నారు.. మన ధర్మయ్యగారి వంతువచ్చింది. చిత్రగుప్తుడు ఖాతా పూర్తిగా తిరగవేసి, అతను చేసినవన్నీ పాపములే అని, పుణ్యకార్యములు ఏవియు చేసి ఎరుగడని, తగువిధముగా శిక్షించవలసినదిగా ధర్మరాజుకు విన్నవించుకున్నాడు.

మన ధర్మయ్య చిత్రగుప్తుడు చెప్పినదంతా విన్నాడు. చాల కోపము వచ్చిందాయనకు తప్పుడు లెఖలు వ్రాసినందులకు నిందించాడు. మరల తన ఖాతాను చూడమని కోరాడు. కాని మన ధర్మయ్య ఎంతులు ఏదైనా పుణ్యకార్యము చేస్తేగా. ఎక్కడా చిత్రగుప్తుని దృష్టిలో అందలేదు, ధర్మయ్య చేసిన పుణ్యకార్యము.

చివరకు ధర్మయ్య తను చేసిన పుణ్యకార్యములను వల్లించాడు, గోదానము చేసినట్లు, పండితులను గౌరవించినట్లు, మరియు సర్వసంగ పరిత్యాగము చేసి సన్యాసాశ్రమము స్వీకరించి, సమాధిలో చేరినట్లు. ధర్మరాజు, ధర్మయ్య చేసిన వినతిని పరిశీలించి ధర్మయ్య, ఒకపాలు పుణ్యము 99 పాళ్లు పాపము చేసినట్లు తీర్పుయిచ్చాడు. ఏది మొదట అనుభవించవలయుననే విషయం ధర్మయ్యనే కోరుకోవలసినదని తీర్పు చెప్పాడు.

జమకాక ఖర్చు కోరని ధర్మయ్య మొదట పుణ్యఫలము అనుభవించెదనని విన్నవించుకొని పుణ్యలోకమునకు పోయి పరిమితకాలము సుఖము అనుభవించాడు.

పుణ్యఫలము అయిపోయింది. పాపఫలము అనుభవించే రోజు వచ్చింది. యమధర్మరాజు వద్దనుండి వర్తమానము వచ్చింది. ధర్మయ్య సామాన్యుడా! యమధర్మరాజునే రావలసినదిగా తిరుగు చెప్పి కింకరులను పంపివేశాడు. తప్పుతుందా! యమధర్మరాజు ధర్మయ్యను యమలోకమునకు తీసుకువెళ్లుటకు వచ్చాడు. కాని ధర్మయ్య యమధర్మరాజుకు విన్నవించుకున్నాడు. తను చేసిన పాపము బాకీ ఏమియు లేదని తన పాపములన్నియు పుణ్యలోకములో పుణ్యపురుషులను, యమధర్మరాజును చూచుటచే హరించిపోయినవని వాదించాడు. నిజమే పుణ్యలోకములో దేవత్వము కల్గిన పురుషులను చూడగల్గుట పాపికి ఎట్లు సంభవించును? యమధర్మరాజుకు ఏ త్రోవా దొరకక, యమలోకానికి తిరుగుదోవ పట్టాడు వొంటరిగా. ★

# పట్టుబడిన దొంగ

విజయవాడలో ఒక ధనికుని యింటిలో దొంగలు పడి సుమారు మూడులక్షల ఆస్తి దోచుకున్నారు. ఈ విషయంలో ప్రజలలో అలజడి బయలుదేరింది. ఎక్కడచూచినా ప్రజలు యీ దొంగతనం విషయమే మాట్లాడుకుంటున్నారు. ప్రభుత్వం పరిశోధకులను నియమించింది. పోలీసువారు యీ విషయంలో బాగా శ్రద్ధవహించారు.

పేరుపొందిన యిన్స్పెక్టర్లలో రామయ్య ఒకడు. అతడీ దొంగతనం విషయమై రాత్రింబగళ్లు పరిశోధిస్తున్నాడు. సుమారు రాత్రి తొమ్మిదిగంట లవుతోంది...లక్ష్మీ టాకీసు వెనుకవీధి....నిర్మానుష్యంగా వున్నది ... రామయ్య మామూలుగా గస్తీ తిరుగుతున్నాడు. చాలా జాగ్రత్తలో వున్నాడు. వీధి అంతా నిశ్శబ్దంగావున్నది.

ఇంతలో ఎక్కడనుంచో మాటలు వినవచ్చాయి.

"ఒరేయ్! నంగయ్య నంతు ఎంతవచ్చిందిరా?"

"ఎనభై వేలు! నీ కెంతవచ్చిం దేమిటి?"

"లక్షాయిరవై వేలు."

"రామయ్యకెంత?"

"లక్షరూపాయలు."

ఇన్స్పెక్టరు రామయ్యముఖం వికసించింది. ఇక నేం. దొంగలు దొరికిపోయారు...మూడు లక్షల ఆస్తికే భాగాలు పంచుకుంటున్నారు...వీళ్ళని పట్టుకుంటే దెబ్బతో ప్రమోషన్!!!

జాగ్రత్తగా యింటి నంబరు 'నోట్' చేసుకుని దగ్గరనున్న పోలీసుస్టేషనుకు పరుగెత్తాడు. జరిగిన విషయమంతా చెప్పాడు. అందరూ సంతోషించారు. ఈసారి రామయ్యకు తప్పక ప్రమోషన్ వస్తుందనుకొన్నారు, ఎందుకైనా మంచిదని రెండు గొడ్డళ్లు, నాలుగుకత్తులు నాలుగు రివాల్వర్లు జాగ్రత్తపరచుకొన్నారు. ఐదునిముషాలలో పై

ఎ. శ్రీరామశర్మ

సరంజామాతో లక్ష్మీటాకీసు వెనుక వీధిలో రామయ్య "నోట్" చేసి వుంచిన యింటిముందు పోలీసుల లారీ ఆగింది.

"టకటకటక..."తలుపుకొట్టారు పోలీసులు. జవాబుశూన్యం... అంతా నిశ్శబ్దం.

మళ్ళీ తలుపుకొట్టారు పోలీసులు. ఈసారయినా జవాబు లేదు.

తప్పకుండా దొంగలే అయివుంటారని నిశ్చయించుకున్నారు. పోలీసులు తీసుకువచ్చిన గొడ్డళ్ళ సహాయంతో తలుపులు పగలగొట్టారు.

లోపల యిద్దరుపిల్లలు తప్ప యింకెవరూ లేరు... యిల్లంతా గాలించారు... దొంగలు పారిపోయివుంటారని, వారి ఆచూకీ పిల్లలకు తెలిసివుంటుందని అనుకొని ఆ పిల్లలనిద్దరిని "అరెస్టు" చేశారు.

రామం: చాలాసేపునుంచి చూస్తున్నా! ఎండలో అలా నిలబడ్డావేరా? సూర్యం.

సూర్యం: చొక్కాని చీమలున్నాయి, చస్తాయని.

—యం. వెం. రా. సామర్లకోట.

మర్నాటి వుదయం విచారణ. ఆ పిల్లలు యిద్దరూ యిట్లా చెప్పారు "మేమిద్దరం హైస్కూలులో నాలుగవఫారం చదువుతున్నాము. ప్రస్తుతం మాకు పరీక్షలు. ఈరోజు లెక్కలపరీక్ష... రాత్రి మేము "పెట్టుబడి—లాభములు" లెక్కలు చేసుకుంటుండగా, పోలీసులువచ్చి మమ్మల్నిద్దరినీ పట్టుకున్నారు... ఇంతకు తప్ప మాకింకేమీ తెలియదు..."

విషయం ప్రతివారికి తెలిసిపోయింది. ఆ పిల్లలిద్దరూ లెక్కలు చేసుకుంటూ, జవాబులు సరిచూచుకుంటున్నప్పుడు, డబ్బుమాట విని దొంగలేమోనని అనుమానపడి "అరెస్టు" చేశాడు పోలీసువాడు.

అందరూ పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వారు. 'ప్రమోషన్' మాట అటుంచి ముఖం తెలవేశాడు పోలీసు యిన్స్పెక్టరు రామయ్య. ★

# విజ్ఞానవధులు

## "డాక్టర్"

జె. వి. సూర్యంగారు, విజయనగరం.

ఇంగ్లీషు నెలల రోజులకూ మన నెలల రోజులకూ తేడాకి కారణమూ? వివరించి.

ఇంగ్లీషు నెలలు, 31, 28, 31, 30, 31, 30, 31, 31, 30, 31, 30, 31 రోజులతో 365 రోజులవుతున్నాయి. లీపు సంవత్సరము నాలుగేండ్లకు ఒకమారు వస్తుంది. అప్పుడు ఫిబ్రవరికి 29 రోజులు వస్తాయి. అంటే ఏమన్నమాటా? ఇంగ్లీషు సంవత్సరము 365¼ రోజులన్నమాట కాదూ? ఇదే అసలు సంవత్సర ప్రమాణము. మనము చంద్రుణ్ణి బట్టి నెలలు ఏర్పరుచుకున్నాము. ఇందువల్ల సంవత్సరానికి సుమారు 10 రోజులు తక్కువౌతాయి. ఇలాగ మూడు ఏండ్లకి సుమారు 30 రోజులైతే దానిని అధికమాసము చేసుకుని మూడు సంవత్సరాల మొత్తపు పొడవును అందుకుంటున్నాము. మనకి నెలయొక్క పొడవు ఒకటే; అంటే రోజులు. వాళ్ళకి సంవత్సరము పొడవు ఒక్కటే; 365¼ రోజులు. వారు సంవత్సరాన్ని ఒకే ప్రమాణములో ఉంచి నెలకి కల రోజులు సర్దుకున్నారు. మనము నెలకి కల రోజుల్ని మార్చక సంవత్సర ప్రమాణాన్ని మూడేళ్ళ కొకసారి 13 నెలలుగా పెట్టుకుని మార్చుకున్నాము.

జవ్వాది నరసింగరావుగారు, శ్రీకూర్మం.

కలలు రావడానికి మూడు కారణాలు తెలిశాయి ఇప్పటికి. అందని ఆశలు పెంచుకోవడము ఒకటి. బంగారు కొండలూ, వెండి కడ్డీలతో నిండిన ఓడలూ కనబడతాయి కలలో ఇలాంటివారికి. మనము పడుక్కునే వైఖరిలోగాని, పక్కమీద ముడతలవల్లగాని, ఏదో అడ్డు ఏర్పడడము రెండో కారణము. కడుపు ఉబ్బ తిని పడుక్కుంటే, కడుపులోని ఒక తిత్తి ఇంకొక తిత్తిని నొక్కి దానికి సంబంధించిన కలను కలిగిస్తుంది. మూడోది జరగబోయే [illegible]. ఇవి చాలా అరుదుగా కలలో కనబడతాయి. కాని కనపడడము మాత్రము కద్దు.

[illegible] శ్రీనివాస శర్మగారు, నెల్లూరు.

గాఢసుషుప్తిలో తెలివి రాకుండా చేసు[illegible] సాధ్యమే. బలహీనులు బలమైన నిద్రకారక రసాయనము సేవించి నిద్రపోయి [illegible] లేవకపోవడము కద్దు.

రక్తవాతరోగులు కొందరు నిద్రలోనే మరణిస్తారు. కారణము వారికి ఎక్కువ మనస్తాపము కలిగించే కలయనీ, ఆ తాపమువల్ల మెదడులోని రక్తసిరలు చిట్లిపోవునయనీ వైద్యులు అంటారు.

నాదెళ్ళ నాగేశ్వరరావుగారు, చెన్నపట్నం.

ఏటంబాంబులో వాడబడే ప్రధాన పదార్థము తేలిక యురేనియము. న్యూట్రానుల చే అణ్వాంతరకణములతాకిడికి ఈ యురేనియము కణము రెండుముక్కలగును. అయితే ఇలాగ ముక్కలయేటప్పుడు కొంత వస్తువు శక్తిగా మారిపోవును. తేలిక యురేనియపు అణువులన్నీ ఈరీతిగా తెగిపోయేసరికి బ్రహ్మాండమైనశక్తి పుట్టి నగరాన్ని నగరాన్నే మాడ్చి వేయును.

హైడ్రోజను పరమాణువులు కొన్ని చేరి ఇంకొక పదార్థమేది ఏర్పడినా, మొత్తపు బరువులో కొంతభాగము శక్తిగా మారును. హైడ్రోజను బాంబు నిర్మాణము మాకు సరిగా తెలియదు గాని హైడ్రోజను అణువుల చేరికవల్ల - శక్తిరూపము ధరించే ద్రవ్యముయొక్క - మహాశక్తియే దాని శక్తి అని మాత్రము చెప్పగలము.

—సాముద్రికము విజ్ఞానశాస్త్రసంబంధి కాదు, ఎడమచేయీ కుడిచేయీ మాటుటలోని సబబు ఎవరూ చెప్పలేరనుకుంటాము.

—రేడియో 'గురగుర'లు ఆకాశములో జరిగే మెరుపులవల్ల కలుగుతాయి. మెరుపులంటే కంటికి కనబడేటంత కాంతిగలవి మాత్రమే కాదు, తక్కిన వీని. మోటారు ఇంజనులలోని మెరుపులే 'టకటక' మని వినబడతాయి. వినలేదా మీరు?

ఆ. దశరథరామరెడ్డిగారు, కురుగొండ.

—ఈథరన్నది శాస్త్రజ్ఞులు ఊహించిన సర్వవ్యాపకపదార్థము. తరంగములు నీటిమీదా, శబ్దతరంగములు గాలిలోనూ, ప్రయాణించినట్లే, వెలుతురు తరంగములు ఈథరులో ప్రయాణించునని ఊహించినారు. అయిన్‌స్టీను సాపేక్షవాదము ధర్మమా అని ఈథరు దయ్యము అదృశ్యమైపోయినది.

వి. వి. రమణారావుగారు, గుంటూరు.

ఎలక్ట్రిక్ ఫాన్ ఆకుల వంపువల్ల ఆ ఆకులముందున్న గాలి ఫాన్‌కి లంబంగా తోయబడుతుంది. ఆకుల వేగము హెచ్చినట్లయితే గాలి జోరుగా వస్తుంది. గాలి ఉన్న గదిలో ఫాన్ తిరిగితే గాలి వస్తుంది గాని, గాలిని తోడివేసిన బీరువాలో బిగించి ఆకులు తిప్పితే గాలి ఎలాగు వస్తుందీ? ఉన్న గాలిని ముందుకి తోయ్యడానికే ఫాను. అది గాలిని సృష్టించదు.

కనక శూన్యప్రదేశములో ఎలక్ట్రిక్ ఫానును తిప్పితే ఏమీ లాభమూ లేదు. దాని ముందున్న కాగితము ముక్కల్ని ఎగరగొట్టడానికైనా గాలి అంటూ ఎంతో కొంత ఉండాలిగదా. గాలిఅన్నదే లేకుంటే కాగితము మాత్రము ఎలాగ ఎగురుతుందీ?

క. విఠలరావుగారు, నెల్లూరు.

గొఱ్ఱె, ఆవు, వంటి జంతువులను అడవులలో త్వరత్వరగా గడ్డిమేసి క్రూరమృగాలబారిని పడకుండ తప్పుకుపోవలసిన అవసరమున్నది. కనుక నెమరువేయుట అనే విశేషశక్తి వాటికి వచ్చింది.

—మీ సామాన్యశాస్త్రముడొరి లోకి జవాబులకోసము మమ్మల్ని అడగడమెందుకూ!





చంద్రలోకమునుండి జారివచ్చిన జింక!

చిత్రకారుడు: కోవల్లి గోపాలకృష్ణమూర్తి - ఏలూరు.



హిందీ, ఇంగ్లీషులలో తీయబడిన "గాంధీపథ్" అనే చిత్రంలో నందిత (రవీంద్రనాథ టాగూరు మనుమరాలు), మరొక బాలనటి. ఈ చిత్రం నిర్మాత అలెగ్జాండర్ మార్కే. ఇది సెప్టెంబరు ఆఖర్లో విడుదల అవుతుంది.

## "మిస్సమ్మ"

ప్రముఖ తారాగణంతో తలపెట్టబడిన విజయావారి "మిస్సమ్మ" చిత్రంలో భానుమతి ప్రస్తుతం నటించడంలేదు. భానుమతి కథానాయికగా ఈ చిత్రం షూటింగ్ కొన్ని రోజులుజరిగింది. భానుమతి స్థానే సావిత్రి నియమించబడిందని, జమున కొత్తగా బుక్ చేయబడిందనీ కూడా తెలుస్తోంది.

## "అనార్కలీ"

అంజలీ పిక్చర్సువారు నిర్మిస్తున్న చరిత్రాత్మక ప్రేమకథాచిత్రం "అనార్కలీ" దాదాపు సగం తయారైనట్లు తెలుస్తోంది. అంజలీదేవి, నాగేశ్వరరావులు అనార్కలీ, సలీములుగా, ఎస్. వి. రంగారావు అక్బర్ గా, నాగయ్య రాజామాన్‌సింగ్ గా, కన్నాంబ జోధ్‌బాయిగా నటిస్తున్నారు. దర్శకుడు వేదాంతం రాఘవయ్య; రచయిత సముద్రాల; సంగీత దర్శకుడు ఆదినారాయణరావు.

కొద్దిరోజులుగా ఈ చిత్రం షూటింగ్ అక్బర్ దర్బారు సెట్ పై జరుగుతున్నది ★

"గాంధీపథ్"లో ఒక ఉత్సవ దృశ్యం.

# గొప్ప డాక్యుమెంటరీ చిత్రం

## "భారతవాణి"

గాంధీ సంస్కృతినిధివారు తయారు చేసిన డాక్యుమెంటరీ చిత్రం "భారతవాణి" ఇటీవల మద్రాస్, వెల్లింగ్టన్‌లో ప్రదర్శింపబడింది. మద్రాస్ గవర్నరు శ్రీ ప్రకాశగారు దీనికి హాజరయ్యారు. టిక్కెట్ రేట్లు ఎక్కువగా ఉన్నప్పటికి అరోజు ఆటకు ప్రేక్షకులు చాలామంది వచ్చారు.

1929 డిసెంబరునుండి 1932 జనవరి వరకూ భారతదేశంలో జరిగిన ప్రధాన రాజకీయ సంఘటనలను, వాటిలో గాంధీజీ నిర్వహించిన పాత్రను ఈ చిత్రం సమీక్షిస్తుంది. ఆ రోజుల్లో అమెరికన్ సినిమా కంపెనీలు, తదితరులు తీసిన న్యూస్‌రీళ్ళసహాయంతోను, వార్తాపత్రికలు తీసిన ఫోటోల సహాయంతోను ఈ చిత్రం నిర్మించబడింది. దీని నిర్మాణంలో బ్రిటిష్ దర్శకుడు హెర్బర్ట్ మార్షల్, వి. శాంతారాం, ఖావ్‌వాని మున్నగువారు పాల్గొన్నారు. చిత్రం నిడివి 6 వేల అడుగులు. గాంధీజీకి సన్నిహిత సహచరులైన మీరాబెన్, ప్యారీలాల్ గార్లు, దేవదాస్ గాంధీ ఈ చిత్రానికి ఇంగ్లీషులో కామెంటరీ ఇచ్చారు. ఇది అంతర్జాతీయప్రదర్శనకోసం నిర్మితమైనా, ముందు ఇండియాలోని ప్రధాన పట్టణాలలో ప్రదర్శిస్తున్నారు.

లాహోరు కాంగ్రెసు సభలో చేయబడిన 'పూర్ణస్వరాజ్య' తీర్మానం, దండి సత్యాగ్రహ యాత్ర, ఉప్పు సత్యాగ్రహం, నిరాయుధులైన వేలకొలది సత్యాగ్రహులపై లాఠీచార్జీలు, గాంధీ ఇర్విన్ చర్చలు, లండన్‌లో జరిగిన రెండవ రౌండ్ టేబిల్ సమావేశానికి గాంధీ, సరోజినీ నాయుడు, మాలవ్యా మున్నగు దేశనాయకులు, కొందరు స్వదేశ సంస్థానాధిపతులు హాజరు కావడం, లండన్, మాంచెస్టర్,



హాలివుడ్ సంస్థ
డా॥ అలెగ్జాండర్ మార్కే.

బర్మింగ్‌హాం, ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి నగరాల్లో గాంధీజీ సంచారం, రౌండ్ టేబిల్



పోయినహారాన్ని ఎస్. వి. రంగారావు వెదికి తెచ్చి నాగేశ్వరావు కివ్వగా అంజలీదేవి తిరిగి దాన్ని తిరస్కరిస్తోంది.
ప్రతిభా వారి "లక్ష్మమ్మ" లో దృశ్యం.

సమావేశం విఫలమై గాంధీజీ స్వదేశానికి తిరిగివస్తూ, ఎన్నాళ్ళనుంచో ఆయన కలుసుకోవాలనుకుంటున్న ప్రఖ్యాత రచయిత రోమారోలాను జెనీవాలో కలుసుకోవడం, ఇటలీలో ముసోలినీ ప్రభుత్వం ఆయనను ఆతిథ్యం స్వీకరించమనడం, బొంబాయిలో ఆయన ఓడదిగగానే బ్రహ్మాండమైన ప్రజాసమూహాలు స్వాగతమివ్వడం - ఈ చరిత్ర యావత్తూ, యథాతథంగా ఈ చిత్రంలో చూస్తాము. ఈ చరిత్ర అంతా ఈనాటికీ జాగ్రత్తగా పరిరక్షించబడి ఉండడం ఎంతో గొప్పసంగతి.

గాంధీజీ వ్యక్తిత్వంలోని ప్రత్యేకతను, అనివార్యమైన ఆకర్షణశక్తిని వెలికి తీసుకురావడమే ఈ చిత్రంలో ప్రధాన విశేషం. గాంధీజీని ఒక అమెరికన్ విలేఖరి ఇలా అడిగాడు: "మీరు రౌండ్ టేబిల్ సమావేశానికి ఈ అంగవస్త్రంతోనే వెడతారా?" గాంధీజీ: "అవును. ఇప్పుడే దుస్తుల్లో ఉన్నానో, ఆ దుస్తులతోనే వెడతాను."

బకింగ్ హాం భవనంలో విందుకు ఆహ్వానించినప్పుడుకూడా ఇలాగే వెడతారా? లేక యూరోపియన్ దుస్తులు వేస్తారా?" గాంధీజీ: "నేను యూరోపియన్ దుస్తుల్లో కృత్రిమంగా కనిపిస్తాను. అందుచేత ఆ దుస్తుల్లో వెళ్ళడం రాజదంపతులను అగౌరవించినట్లవుతుంది."

ఇటువంటి చక్కని సన్నివేశాలు ఈ చిన్న చిత్రంనిండా ఉన్నాయి. ముఖ్యంగా 'ప్రిన్సెస్ రాజపుటానా' నౌకలో గాంధీజీ లండన్ ప్రయాణమై వెళ్లడం హృద్యమైన దృశ్యాలతో కూడివుంది. ఆయన దినచర్య వివరంగా చూపబడింది. ఈ దృశ్యాలన్నీ గాంధీజీ వ్యక్తిత్వాన్ని ఒక డజను పుస్తకాలు వ్యక్తం చేయలేనంత బలంగా వ్యక్తం చేస్తాయి.

"భారతదేశపు ఋతురాజు" అని టాగూర్ ప్రశంసించిన యువకుడు నెహ్రూ, ఆయన భార్య కమలానెహ్రూ, కస్తూర్బాయి గాంధీ, వల్లభ్ భాయ్ పటేల్, విఠల్ భాయ్ పటేల్, ఆజాద్ మొదలైన వారంతా అప్పటి చరిత్ర పుటల్లోంచి నడిచి వచ్చినట్లు కనిపిస్తారు.

నేపథ్యసంగీతం ముఖ్యంగా ప్రశంసించదగింది. లండన్ ప్రయాణంలో మార్గమధ్యాన ఈజిప్టు తగిలినప్పుడు వినిపించబడిన ఈజిప్షన పడవపాట అత్యంత మనోజ్ఞంగా ఉండి మళ్ళీ మళ్ళీ వినాలనిపించేదిగా ఉంది.

ఈ చిత్రం అందరూ తప్పక చూడదగినది. ఆంధ్రలో ప్రతిపట్టణంలోను ఈ చిత్రం విడుదలచేయడం అవసరం. గాంధీ సంస్మృతినిధివారు గాంధీ జీవితంలోని ఇతర ఘట్టాలనుకూడా ఇలాగే చలనచిత్రరూపంలో విడుదల చేయిస్తే బాగుంటుంది.

# అలెగ్జాండర్ మార్క్సు "గాంధీపథ్" నిర్మాత

గాంధీ సిద్ధాంతాలు ఆధారంగా హిందీ, ఇంగ్లీషుభాషల్లో "గాంధీపథ్" అనే కథాచిత్రం నిర్మించడానికి సుమారు రెండేళ్ల క్రిందట ఇండియావచ్చిన హాలీవుడ్ నిర్మాత, దర్శకుడు డా॥ అలెగ్జాండర్ మార్క్సు ఈమధ్య మద్రాసు వచ్చి కనెమరా హోటల్లో పత్రికావిలేఖరులతో గోష్ఠి జరిపారు.

తన చిత్రాన్ని గూర్చి చెబుతూ ఆయన ఇలా అన్నారు: గాంధీమహాత్ముని ఆధ్యాత్మికసిద్ధాంతాలమీద, ప్రపంచ రాజకీయాలలో ప్రస్తుతం భారతదేశం నిర్వహిస్తున్న



పక్షిరాజా వారి “అగ్గిరాముడు”లో శ్రీరామ్, సురభి బాలసరస్వతి.

# అలెగ్జాండర్ మార్కే

ఈ చిత్రం తీయడానికి నన్ను ప్రోత్సహించింది. ఇప్పుడు ప్రపంచ రాజకీయాలలో పరస్పరభీతి, అనుమానం, విద్వేషం ప్రబలి ఉన్నాయి. ఈ పరిస్థితి హింసా విధానానికి దారి తీస్తుంది. హింసద్వారా ఏ సమస్యా ఎప్పుడూ పరిష్కారం కాలేదు. కనుక సమస్యలపరిష్కారానికి హింస నవలంబించడమంత తెలివితక్కువ మరొకటి లేదు. సౌజన్యమే సర్వసమస్యలకూ పరిష్కార సాధనం. ఇటీవలి కాలంలో మహాత్మా గాంధీ ఈ సిద్ధాంతాన్ని తన జీవితంలో అనుసరించి చూపించి, దాని విశిష్టతను నిరూపించారు. ఈ విషయాన్నే నేను నా చిత్రంలో రూపించదలుచుకున్నాను. నా కథలో ఒక గ్రామాన్ని కేంద్రంగా తీసుకుని, ఆ గ్రామ ప్రజలద్వారా నా సందేశాన్ని ఇవ్వదలుచుకున్నాను. ఈ చిత్రానికి గాంధీ జీవితంతో ప్రత్యక్షసంబంధం లేదు. ఈ కథ ప్రపంచంలో ఎక్కడైనా, ఏ కాలంలోనైనా జరగవచ్చు. ఇది అంతర్జాతీయ ప్రదర్శన కోసం ఉద్దేశింపబడినది. హిందీ చిత్రం నిడివి 11000. ఇంగ్లీషు చిత్రం నిడివి 9000.

సంగీతం పూర్తిగా భారతీయమూ కాదు, పూర్తిగా పాశ్చాత్యమూ కాదు, సంకరమూ కాదు. ఒక రకమైన అంతర్జాతీయ సంగీతాన్ని సృజించాలనుకుంటున్నాను. శాంతారాం స్టూడియో టెక్నీషియన్ల సహాయంతో పూర్తిగా ఔట్‌డోర్‌లోనే తీయబడింది. ఇది రంగుల చిత్రం. సెప్టెంబరు అంతంలో విడుదల చేయబడుతుంది. ఇందులో ప్రొఫెషనల్ తారలు, నటులు ఒక్కరు కూడా లేరు. అందరూ కెమెరాకు కొత్తవారే. దీనికయిన ఖర్చు “ఝాన్సీకీ రాణీ”కి అయిన ఖర్చులో మూడో వంతుకూడా ఉండదు.

విలేఖరులడిగిన చాలా ప్రశ్నలకు ఆయన ఉచిత సమాధానాలిచ్చారు. భారతీయ చిత్రాలు టెక్నికల్‌గా హాలీవుడ్ చిత్రాలకంటె వెనకబడి ఉన్నాయి. చిత్రాన్ని పూర్తిగా డైలాగులతో నింపి వేయడం సినిమా లక్షణాలకు విరుద్ధం. వాటిని డైలాగులనడంకూడా అనవసరం. అన్నీ ఉపన్యాసాలే. ఇక పాటలసంగతి చెప్పనక్కర్లేదు. కూర్చుంటే పాట, నుంచుంటే పాట, ఏడుస్తూ పాట, నవ్వుతూ పాట. ఏ పాత్రకీ పాత్రత్వం ఉండదు. అన్ని పాత్రలూ యాంత్రికంగా డైరెక్టరుచేతి కీలుబొమ్మలవలె ఉంటాయి. హాలీవుడ్ చిత్రాలు లోపరహితమని నే ననడం లేదు. హాలీవుడ్ చిత్రాలు కూడా యాంత్రిక వస్తువులవలె తయారవుతున్నాయి. స్వతంత్ర ప్రతిభగలవాడికి అక్కడ కూడా స్థానం లేదు.

శాంతిసందేశాన్నిచ్చే మీ చిత్రం అమెరికాలో ఆదరణ పొందుతుందా, అని ఒక విలేఖరి అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఆయన ఇలా అన్నారు: “అమెరికన్ ప్రజాబాహుళ్యం శాంతినే వాంఛిస్తున్నది. అమెరికా అంటే సెనేటర్ మెకార్థీ, సెనేటర్ నోలాండ్, నిక్సన్, డలెస్ మాత్రమే కాదు. లక్షలాది సామాన్య పౌరులున్నారు. వీరు తమ అభిప్రాయాలను వ్యక్తం చేయడానికి వీలులేక ఊరుకున్నారుగాని, నిజంగా వారు యుద్ధప్రియులు కారు, శాంతికాముకులే. వారు నా చిత్రాన్ని చూసే అవకాశం లభిస్తే తప్పక హర్షిస్తారని నా నమ్మకం.”

## చార్లీ చాప్లిన్

చార్లీచాప్లిన్‌నుగూర్చి ఏమైనా చెబుతారా అని ఒక విలేఖరి అడగ్గా డా॥ మార్కే ఇలా అన్నారు: “చార్లీచాప్లిన్ మిత్ర బృందంలో నేనొకణ్ణి. నేనాయనతో చాల రోజులు సన్నిహితంగా గడిపాను. కాలిఫోర్నియాలో డా॥ ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ ఉండేరోజుల్లో ఆయనా, నేను, మరి కొద్దిమంది మిత్రులూ సాయంత్రాలప్పుడు చాప్లిన్ ఇంట్లో కలుసుకునేవాళ్ళం. ఒక్కొక్కరోజు తెల్లవారుఝామువరకూ అక్కడే గడిపేవాళ్లం. చాప్లిన్ సినిమా ప్రపంచంలో సాటిలేని నటుడు, నిర్మాత, దర్శకుడు. ఈ సంగతి మీకు ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు. కాని వ్యక్తిగా చాప్లిన్ ఇంకా ఎంతో గొప్పవాడు. ఆయన గొప్ప తత్వవేత్త. మానవత్వంమీద ఎనలేని విశ్వాసంగలవాడు. మేము ఆయనఇంట్లో కలుసుకున్నప్పుడు ఆయన అతిథులందరికీ వయొలిన్ వాయించి వినిపించేవాడు. చాప్లిన్‌తో సమానంగా వయొలిన్ వాయించే వాళ్లు చాలకొద్దిమంది ఉన్నారు. చాప్లిన్‌తో పాటు డా॥ ఐన్‌స్టీన్‌కూడా వయొలిన్ వాయించేవాడు.

చార్లీచాప్లిన్‌ను అమెరికానుండి బహిష్కరించడం సిగ్గుమాలినపని.” అనికూడా ఆయన అన్నారు.

★



జనతా వారి "పరివర్తన"లో రమణారెడ్డి, ఎన్. టి. రామారావు.

# పౌరాణిక చిత్రాలపై చర్చ

ఇటీవల విపరీతంగా విడుదలౌతున్న సాంఘిక చిత్రాలు ప్రజలు చూడలేక విసుగెత్తిపోతున్న తరుణంలో మళ్ళీ పౌరాణిక, భక్తిచిత్రాల నిర్మాణం మొదలవుతున్నందుకు ప్రేక్షకులు ఎంతగానో సంతోషిస్తున్నారు. ప్రజల్లో పౌరాణిక చిత్రాలు చూచే ఉత్సాహం తగ్గిపోయినట్లు ఈ ప్రాంతంలో, అంటే ప్రజలున్నప్పటికీ వాళ్ళకి బాగా అర్థం అవుతుంది. అంతేగాని! ఎక్కడో, పిట్టలదొరలాంటి కొన్ని చిత్రాలు తప్ప ఏదో ఒక శక్తి సాంఘిక చిత్రాన్ని నిర్మాతలే తిలంపులకలవారికి అర్థం కాదు.

ఏనాటి కయినా నిర్మాతలు మంచి భక్తిరసచిత్రాలు, చారిత్రాత్మక చిత్రాలు, కళాత్మక చిత్రాలు, నిర్మిస్తోన్నారంటే నిజంగా అందరూ హర్షించదగ్గ విషయం. 18-7-54 "ఆంధ్రపత్రిక వీక్లీ"లో పౌరాణికచిత్రాలు ప్రజలు చూడలేకపోవడానికి అనుమానాన్ని వ్యక్తపరుస్తూ శ్రీ "పహరా" అనే రచయిత గారు వ్రాసిన వ్యాసానికి మేము వ్యతిరేకిస్తున్నాం. ఏమంటే, పరిస్థితులు పౌరాణికాలకు అనుకూలంగా మారినట్లు ఈమధ్య అనేక నిదర్శనాలు కనబడుతున్నవి. కొంతస్తే అనేక సాంఘిక చిత్రాలు ఘోరంగా పరాజయం పొందినవి.

సాంఘిక చిత్రాలలో ప్రేమను కూడా చూపిస్తున్నామనే కారణంతో ఎక్కువగా అవినీతిని ప్రచారం చేస్తున్నారు. అసలు చిత్రపరిశ్రమ ఇంత వృద్ధిలోకి వచ్చిందంటే "భక్తపోతన" "యోగివేమన" "త్యాగయ్య" "భక్తఅంబరీష" "చక్రధారి" లాంటి చిత్రాలే అని అందరూ ఒప్పుకుంటారు. ఈ రోజుల్లోకూడా ప్రజలు పౌరాణిక చిత్రాలు తప్పక ఎక్కువగా చూస్తారని ఎందరో ఉదాహరణలు చెప్పగలను. కనుక పౌరాణికచిత్రాలకి సుస్వాగతం చెబుతున్నాం.

యం. కే. బాబు — తెనాలి.

* * *

## తిరోగమనం

నవనాగరికతకు పురోగమనమే కాని తిరోగమనం లేదు. నవనాగరికతకు

అయిన ప్రజలు అనాగరికులవడం యెంత హాస్యాస్పదమో — పౌరాణిక చిత్రాలపై ప్రజలు తిరిగి అభిమానం చూపుతారనుకోవడం అంత పొరపాటు. ప్రస్తుతం చిత్రాల అపజయానికి కారణం చిత్రాలలో నూతనత్వం కొరత కావడమే! పౌరాణిక చిత్రాలు తిరిగితీయడంవల్ల నూతనత్వం కలుగుతుందనుకోవడం వింతవిషయమే. అంతేకాక పౌరాణిక చిత్రాలు వాస్తవానికి, సత్యానికి దూరంగా ఉండడంవల్ల ప్రజలకు యేమాత్రం అభిరుచిని కల్గించవు. ఈ విషయంలో నిర్మాతల తిరోగమనం విజయవంతమౌతుందని చెప్పడం కష్టం.

అవసరాల సత్యమూర్తి—
రాజమండ్రి.

* * *

## సాంఘికాలకు ప్రజాదరం లేదు

"పహరా"గారి "పౌరాణికకథలవైపు తిరోగమనం" చదివాను. కాని ఆ వ్యాసంతో పూర్తిగా నే నేకీభవించలేకపోతున్నాను.

రచయితగారు యీనాడు వెలువడుతున్న అన్ని చిత్రాలు హిందీ చిత్రాల సంగీతాన్ని కాపీ చేస్తున్నాయి అన్నారు. అన్ని తెలుగుచిత్రాలు అంటే మరి మొన్న మొన్ననే విడుదలైన "చక్రపాణి" కూడా యీ రకం జాబితాలోకి చేరుతుందా? అందుకని అన్ని తెలుగు చిత్రాలు అని మాత్రం అనలేం - ఏమంటారు?

ఇక రెండవ ఆరోపణ - పెద్దపెద్ద ఫిలిం సంస్థలు కూడా ఫిలింను త్వరగా నిర్మించాలనే వుద్దేశంతో సాంకేతిక ప్రమాణాలగూర్చి అట్టే శ్రద్ధ వహించడంలేదు. అందువల్ల సినిమాలు దెబ్బ తింటున్నాయి, అన్నారు. అయితే పెద్దపెద్ద సంస్థలన్నారు. మరి యీ సంవత్సరారంభంలో విడుదలైన 'చంద్రహారం' "పెద్దమనుషులు" మొదలైన చిత్రాలు సాంకేతిక ప్రమాణాలకు దూరంగా వున్నాయని రచయిత అభిప్రాయమా? సాంకేతిక ప్రమాణాలే చిత్ర విజయానికి కారణాలు అంటే, యిటీవల విడుదలై బాగా పోతున్న "మనోహర" చిత్రం సాంకేతికంగా వుత్తమమని అనగలమా? అందువలన బిగువైన సన్నివేశాలు, ప్రజారంజకమైన కథాగమనం వుంటేనే కాని చిత్రం రాణించదని నా అభిప్రాయం.

ఇక ప్రజాసమస్యలు గురించి ప్రజలకు కావలసిన, పనికివచ్చిన చిత్రాలు తీయక మళ్ళీ మన నిర్మాతలు "సక్కుబాయి, సతీ సావిత్రి"వంటి కథలవైపు తిరోగమిస్తున్నారన్నారు. సమస్యలు గురించి, ప్రజల జీవనం, ముఖ్యంగా కార్మికుల జీవితానికి సంబంధించిన యితివృత్తం గల చిత్రాలు "నిరుపేదలు," "తోడుదొంగలు" కాదా? మరి యీ చిత్రాలను ప్రేక్షకులు ఎంత బాగా ఆదరించారో మనకు తెలియదా? ప్రజాజీవితానికి సంబంధించిన యితివృత్తాలు చిత్రాలుగా తీస్తే మరి ప్రజ లాదరించకపోతే యింకా ఎంతకాలం ఆ చిత్రాలు తీసి నిర్మాతలు నిలవగలరు?

ఇంకొక ఆరోపణ - నూతన భావాలకు అనుగుణంగా చిత్రాలు తీసే సమర్థత లేకనే నిర్మాతలు తిరోగమిస్తున్నారని అన్నారు రచయిత. "తోడుదొంగలు" చిత్రం నూతనంగాక సనాతనంగా వుందా? అందువల్ల నూతనభావాలకు అనుగుణంగా చిత్రాలు తీసే సమర్థత లేక కాదు, సమర్థత చూపినా, ప్రజ లాదరిస్తారో లేదో అనే సంశయం వల్లనే తిరోగమిస్తున్నారు.

ఇక "పౌరాణిక కథలు వాంఛనీయమా - కాదా" అన్న సమస్య. హేతువాదం అలముకునివున్న యీరోజుల్లో పౌరాణిక వాదాన్ని ప్రజలకెత్తిన రుద్దటానికి ప్రయత్నిస్తే భరించడానికి ప్రజలేం మట్టిబొమ్మలు కారు. పౌరాణికవాదం యిష్టం లేనివాడు తగినరీతినే పౌరాణికాలు సత్కరించబడతాయి. రెండుమూడు పౌరాణికాలు విడుదలయినదాకా ఓపిక పట్టండి - తెలుస్తుంది పౌరాణికాలు వాంఛనీయమో కాదో?

బి. వి. విశ్వేశ్వరరావు — శ్రీకాకుళం.

* * *

## "పదండి వెనుకకు..."

"పదండి వెనుకకు—పదండి తోసుక— పోదాం పోదాం వెనుక వెనుకకే"—శ్రీశ్రీని తల్లక్రిందులుజేసి మన తెలుగు సినిమా నిర్మాతలు ఆలపించే కొత్తగీతం యిది.

మనం ప్రస్తుతం వుంటున్నది ఇరవయ్యో శతాబ్దంలో. ఇంకొంచెం ముందు కెళితే హైడ్రోజన్ యుగంలో. ఇప్పుడు మన నెదుర్కొంటోన్న సమస్యలు చాలతీవ్రాతితీవ్రమైనవి. త్వరగా పరిష్కరింప వీలుగానివి. ఆకలి...అనారోగ్యం......నిరుద్యోగం...నిరక్షరాస్యత...... యుద్ధభీతి మానవాళిని చుట్టుముట్టి తమ విషదంష్ట్రిలతో మట్టుబెట్ట యత్నిస్తున్నాయి. సత్యాసత్యాలకు.....న్యాయాన్యాయాలకు..... ప్రజాస్వామిక నిరంకుశత్వాలకూ...వెలుగు చీకటులకు మధ్య సంఘర్షణ ముమ్మరంగా సాగుతోన్న యీ సంధ్యాసమయంలో అశేష ప్రజానీకానికి సక్రమమైనమార్గాన్ని మేధావంతులు, విజ్ఞులు అయినవారు చేయాల్సివుంటుంది. వీరికి సినిమాపరిశ్రమ సహాయపడటం పవిత్రధర్మంగా భావించినప్పుడు గాని యీ మహోద్యమానికి సంపూర్ణత రాదు. ఏమంటే మానవ మనస్తత్వంమీద సినిమాల ప్రభావం నానాటికీ బలపడుతోంది. సామాజిక జీవితానికి దర్పణాలైన చిత్రాలను ప్రజలు సర్వదా ఆదరిస్తూనే వున్నారు. ఉదాహరణగా—"గృహలక్ష్మి"..."మాలపిల్ల"..."షావుకారు"... "పెద్దమనుషులు" వగైరాలను చెప్పవచ్చు. సాంఘికాలు తీస్తే డబ్బు రాదు కాబట్టి పౌరాణికాలు తీసిచూస్తాం అనడం వారి బలహీనతను మాత్రమే తెల్పుతుంది.

మన నిర్మాతలు పౌరాణికాలు తీస్తామనే ప్రకటనలు చూసిన ప్రేక్షకులు అసలు చిత్రాలంటేనే విరక్తిపుట్టి దూరంగాపోయే ప్రమాదంవుంది. తక్కువ నిర్మాణపు ఖర్చుతో అట్టే శ్రమలేకుండా తక్కువ కాలంలో నిర్మించ వీలయ్యే సాంఘిక చిత్రాలే అంతంతగావుంటే - విపరీతమైన పెట్టుబడితో కూడిన పౌరాణికచిత్రాలు యింకెంత అధ్వాన్నంగా తయారవుతాయో అంచనా వేయవచ్చు. పౌరాణిక చిత్రాలు తీసేందుకు చక్కని ఊహాశక్తి కావాల్సివుంటుంది. పౌరాణిక కథలు ప్రస్తుతానికి సంబంధించినవి కాకపోవడంచేత స్థల-కాల-స్థితులనుగూర్చిన వివరాలు క్షుణ్ణంగా తెలిసివుండాలి. కళ్ళెదుట స్పష్టంగా కన్పిస్తున్న విషయాలనే సరిగా అవగాహన చేసుకోలేనివారు - (లేకపోతే వాస్తవిక చిత్రాలంటూ అవాస్తవిక చిత్రాలెందుకు తీస్తారు?) - ఊహాజనితమైన విషయాలను సక్రమంగా తెరకెక్కిస్తా రనుకోవడం భ్రమ మాత్రమే. అదిగాక సాంఘికాలకంటే పౌరాణిక చిత్రాలు సాంకేతికంగా ఉత్తమ ప్రమాణంలో వుండాలి. లేకపోతే సన్నివేశంలో పుష్టివుండక రసహీనంగా తయారవుతుంది.

త్వరలోనే విశాలాంధ్రలో అభినవ యమధర్మరాజులు, అపర శ్రీకృష్ణభగవానులు, డూప్లికేటు సావిత్రులు తమ యాత్రలను ప్రారంభించవచ్చు. మహాపవిత్రములు, నీతి ప్రతిపాదకములైన పౌరాణిక గాథలను మన నిర్మాతలు అపహాస్యం చేస్తుంటే ఆంధ్రులు మౌని ఊరుకుంటారనుకోను.

పిడుగు రామలింగయ్య—
[illegible]

* * *

## "కథలో పస వుండాలి"

తెలుగు చిత్రనిర్మాణం సాంఘికాలతో



నరసూవారి "రాజగురు"లో పి. కె. సరస్వతి.

## ★ పౌరాణిక చిత్రాలపై చర్చ ★

ఆసక్తివల్ల, భక్తివల్ల, అభిమానంవల్ల మన నిర్మాతలు ఆనాడు పౌరాణిక చిత్రాలు తీశారు. మన పురాణగాథలను మనపూర్వులే చక్కని సంస్కృతితో ఉత్తమ గాథలుగా రచించారు గనుకనే, మన దర్శకులు తేలిగ్గా, ఏమంత కష్టపడకుండా ఆ కథలను తీసుకొని చిత్రాలు తీశారు. మన పురాణ గాథలు వేరువేరు రసాలతో వేరువేరు విధంగా చిత్రింపబడిన చక్కటి కథలు అవుటచేతనే అవి వరుసగా విజయవంత మయ్యాయి. శ్రీ కృష్ణలీలలు, దశావతారములు, ద్రౌపదీవస్త్రాపహరణం, సతీ అనసూయ, సావిత్రీ వగైరా చిత్రాలు చక్కటి కథలతోకూడిన చిత్రాలు అవటంచేతనే విజయవంతం అయాయిగాని అవి కేవలం పౌరాణికాలు అనిచెప్పి, విజయవంతం కాలేదు. తీసిన కథలనే తీస్తూ, మార్పు తేలేకపోవటంచేతనే, పౌరాణికాలైనా చివరికిచివరికి దెబ్బతినక తప్పలేదు.

పౌరాణికగాథలతో విసుగెత్తినప్పుడు చిత్రాలువచ్చి, కథలలో కొంత మార్పు, కొంత క్రొత్తదనం ఉండటంచేత వాటిని ప్రజలు ఆదరించారు. మాలపిల్ల, రైతుబిడ్డ, దేవత, స్వర్గసీమ, ద్రోహి, పెద్దమనుషులు; ఈచిత్రాలకథలు ఉత్తమమైనవి కావటంచేతనే అవి విజయవంతమయ్యాయి. కాని అవి సాంఘికాలు అని కాదు, విజయవంతమైనది. సాంఘిక గాథలను తయారుచేసుకోవటం పౌరాణిక కథ లెన్నుకోనేటంత తేలిక కాదు.

మన పొరుగువారైన మహారాష్ట్రులుకూడ వారి భాషలో చిత్రాలు తీస్తున్నారు. కాని వారిలో పౌరాణిక, సాంఘిక, జానపద అనే రకాలు లేవు. అవి ఏ జాతికి చెందినవైనా సరే ఉత్తమ కథల నెన్నుకుంటారు. పౌరాణికాలైతే పురాణాలలోని మహోన్నత సంఘటనలను, ఉత్తమమైన ఘటనలను ఏరుకొని చక్కని చిత్రంగా మలుస్తారు. వారి జాతీయత వెల్లివిరిసే చక్కటి సంగీత బాణీలతో ఉత్తమ చిత్రాలు నిర్మిస్తున్నారు. వారు హిందీ చిత్రాలను అనుకరించరు. వారు చిత్రనిర్మాణంలో చూపించే ప్రతిభ, కథలు ఎన్నుకొని రాయటంలో ఉండే దక్షత, స్క్రిప్ట్‌లను ఉత్తమ చిత్రాలుగా మలచటంలో చూపించే నేర్పు,—చివరకు హిందీవారు సైతం మహారాష్ట్రుల కథల కోసం పరుగెత్తక తప్పటంలేదు. వారి పద్ధతిని అనుసరించక తప్పటంలేదు. మన నిర్మాతలు తెలుగు జాతీయత, తెలుగుసంస్కృతి, తెలుగు వెలుగు వెల్లివిరిసే మహోన్నత సాంఘిక కథలను సృష్టించి, చక్కని తెలుగుబాణీలతో కూర్చిన పాటలతో చిత్రాలు నిర్మించాలనే నగ్నసత్యాన్ని మహారాష్ట్రులను, మహారాష్ట్ర చిత్రాలను చూస్తేగాని తెలుసుకోలేరేమో!!

రోజురోజుకు పురోగమిస్తూ, నూతన రుచులతో, ఉత్తమ ఆశయాలతో అభ్యుదయాన్ని ఆకాంక్షించే తెలుగు ప్రజలు కథలలో పసలేంది ఏ చిత్రాలను ఆదరించరని నిర్మాతలు గ్రహింతురుగాక!

మురళీధర రావు—

హైదరాబాదు.

పక్షిరాజా వారి

# అగ్గిరాముడు



నిర్మాత-దర్శకుడు

S.M.శ్రీరాములునాయుడు





★

విశాలాంధ్ర అంతటా

విజయవంతముగ

నడుచుచున్నది




